# నాస్తికధ్వాంతభాస్కరమునందలి విషయసూచిక.

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

# నా స్తి క ధ్వాం త భా స్క ర ము.

## భూమిక.

లోకములో, దమతమ మతవేదములను, దేవునివంటి యనాదుల నికొందఱు, దేవుడు పంపినవనికొందఱు, దేవుడుచెప్పినవని కొందఱు, దేవుడు ఆయావేదవక్తల హృదయాంతర్వర్తిగానుండి, వారల నోట జెప్పించిన వనికొందఱు నిట్లనేక ప్రకారంబులజెప్పుచు, దమతమ వేదములు ముఖ్యములనియు, వానినాక్షేపింప గూడదనియు, వానిలోను న్నట్లు, నడచుకొన వలసినదనియు, నొకమూఢ భక్తితోజెప్పుచు, ఆ వేదములయందలి భాగములు, యుక్తిసహములు గాకపోయినను, ఆ ప్రకారమేనమ్మి కర్మాచరణము చేయుచున్నారు.

ఆవేదములు, దేవునివలెనే, యనాదులయితే, దేవుడు ఆచట్టము నకులోబడి, నడిపించవలెను - అప్పటికి వేదమే దేవునికంటె ప్రబలమవును.

లేక ఆయావేదములు దేవునివలన నేర్పడ్డవైతే దేవునిబిడ్డలమగు మనకందఱకు, భిన్నభిన్నాభిప్రాయములు గలుగులాగున, జగత్సృష్ట్యాది తత్త్వములేమి, యితరతత్త్వములేమి, కర్మములేమి, ధర్మాధర్మ స్వరూపములేమి, ఆచారవ్యవహారములేమి, యివిమొదలైనవిభిన్నభిన్నములుగా, నాయావేదములలో జెప్పబడియుండునా?

ఇందువలననేమి తోచుచున్నదంటె, దేవుడుమొదల నొకవిధము గా జెప్పి పొరపాటుగా జెప్పినాను, అదిసరిగా లేదనియైనా, వేరేవేద నుజెప్పవలె. ఈపక్షములో. దేవునికిమనవలెనే, మఱపును,ఒప్పుకొ

నవలసివచ్చును. లేదా, జగత్సృష్ట్యాదులు మరియొకరి వల్లగాని, లేక తమంతటగాని, అయియుంటే, అప్పటికే, వాట్లతత్వములు బాగాదెలియక, దేవుడు యొకసారి వేదములుచెప్పి, తిరుగాతిరుగా, నప్పుడప్పుడుజ్ఞానము వృద్ధియగుచుండగా నప్పుడప్పుడు వేదములు వ్రాయుచునైనాయుండవలెను.

లేదా, లోకులకు దత్త్వములు తెలియకుండ నుండవలెనని, మోసముగా, నానావిధములుగా , వేదములుచెప్పి పంపించుచు, నుండవలె—లేదా, లోకులు పరస్పరమత విరోధములు గలిగి, యుద్ధములుచేసిమడియు చుండవలెనని, యీలాగునచేసి నైనాయుండవలెను.

వేదములలో,నొకవేదములోనైనా తత్త్వములు స్పష్టములుగా, నేకరీతిగలేనందున, నొక్కొక్క వేదమతమువారు,అనేకమతములగల్పించి,యిప్పటికి వాదించుకొనుచు, నున్నవారు— ఈహేతువులవలన, వేదములు పూర్వీకులయిన, ఆయామతస్థ పండితులవలన , జెప్పబడినవే, యనియు, నందువలన వేదరూపకమైన శబ్దముప్రమాణము కాదనియు, దేవుడెవ్వరికిని దత్వములు దెలిపి యుండలేదనియు, నేర్పడుచున్నది కాబట్టి, ప్రత్యక్షానుమాన ప్రమాణములచేత,మనస్సాక్షితో,భగవంతుని నిర్ణయించు కొనవలసినదే యనియు, నీమొదలగు సంగతులతో, మనస్సాక్ష్యమను, తత్త్వగ్రంథమును వ్రాసియున్నవాడను.

మనస్సాక్షివలన, దైవముసత్యముగా నున్నదని యేర్పడినది గాబట్టి, సర్వశక్తిగల దేవుడులేడనిచెప్పెడు, నాస్తికమతస్థుల యుక్తులను, బ్రత్యక్షానుమాన ప్రమాణ యుక్తులచేత, ఖడించ వలసిన యావశ్యకమునాకు గలిగియున్నందున, శ్రీవెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రభూపాలనామ ధేయుండనగు నేను, ఈనాస్తికధ్వాంత భాస్కరము, అను గ్రంథము వ్రాయుచున్నాడను.

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

# నా స్తి క ధ్వాం త భా స్క ర ము,

చార్లస్ బ్రాడ్లా చెప్పిన ప్లీఫర్ ఎతీయిసం, అను
నా స్తికమత గ్రంధమునందలి ముఖ్యాంశములకు.

ఖండనము,

—※ దేవశబ్దముభగవద్వాచకమే గాని, ధ్వన్యాత్మకము గాదనుట. ※—

(౧) ఆశంక.

దేవుడనుపదము, అర్థములేనిడిద్ధక సిద్ధాదిపదములవంటిదని యు, ఆస్తికులు దేవుడున్నాడని, చెప్పునిర్వచనములు చాలనివిగాను న్నందున, ధ్వన్యాత్మకశబ్దమనియు, నా స్తికుడు చెప్పుచున్నాడు.—

ఇందుకు, ఆస్తికుని యుత్తరము.

దేవశబ్దను ప్రసిద్ధముగాఁ గారణమును జెప్పునది- అట్లుకాక కేవలము ధ్వన్యాత్మక మయ్యెడిపక్షములో, నా స్తికులు సత్యముగా నడువవలెనని చెప్పుచున్నారే, యేల.—

అయితే రాజదండనకుభయపడి యట్లు చెప్పుచున్నారనియను కొందమంటే, రహస్యముగాన క్రమములు చేయవచ్చుగదా, అదిసరే యంటే, యొకరికిభయపడి, బయిటికి క్రమముగానడుచుట, సత్యమె ట్లగును.—

{ పూర్ణప్రయత్నపరుడైనను, మనుజుడు నిజా దృష్టానుగుణ ఫలమునే బొందుననుట. }

# నాస్తికధ్వాంతభాస్కరము.

## (౨) ఆశంక.

ఆస్తికుడు దేవునియందు భారమువేసి, ప్రపంచమందుండు నన్ని వాస్తవములను దెలిసికొనజాలకయు, గార్యములుచేయుటలో బూర్ణప్రయత్నముచేయజాలక, కార్యసిద్ధినిబొందజాలడనియు, నాస్తికుడు ప్రపంచమందుండు వాస్తవముల నన్నింటినిజక్కగా దెలిసికొని, గొప్పకార్యములను జేయుటలో, బూర్ణప్రయత్నముచేసి, కార్యసిద్ధినిబొందుచున్నాడనియు, నాస్తికుడుచెప్పుచున్నాడు.—

## ఉత్తరము.

ఇంతవఱకు నాస్తికుడుగూడ, ప్రపంచమందుండునొక్క వస్తువుయొక్క వాస్తవతత్వమ్మునం, దెలిసికొనియుండలేదు.—

ఇందుకు, ననేకదృష్టాంతములుండినను, ఏవస్తువునందయినను, నుండుయావచ్ఛక్తులు ఇప్పటికెనెవరైననుగనిపెట్టినారా, ఇప్పటికిగొన్నిశక్తులు, బుద్ధిమంతులు ఆయావస్తువులలో గనిపెట్టుచునున్నారు.

మఱియు నాయాకార్యములలో నాస్తికులు పూర్ణప్రయత్నముచేసి, యాస్తికులకంటె, నధికసిద్ధుల నెక్కడ బొందియున్నారు-ఏలనంటే, ఏమనుష్యునికిని విద్యాధనాదులు అధికముగా సంపాదింపవలెనన్న యపేక్షలేకయుండదు. ఆస్తికునికంటె నాస్తికులు సదరువిషయములు. అధికముగా, సంపాదించినవారుగా గనుపడరు.—

వారుచెప్పెడు రెండుహేతువుల వలననే, వస్తువుల ననేకోపయోగములకొఱకు. ననేకస్వభావములతో సృజించినవాడును, సమస్తజనులు వారివారియాశలచే, వారివారికిగలిగియుండు స్వతంత్రములతో,శక్తులతో నెంతపూర్ణప్రయత్నముచేసినను, వారివారియదృష్టానుసారముగనే, ఫలములనిచ్చువాడును నయినదేవుడెంత శక్తిగలవాడోయనుసంగతి, నాస్తికునికేల, నూహకురాదో. యిందుకు

నాశ్చర్యపడుచున్నాను.—

—* బ్రహ్మము- అనుమానప్రమాణ గోచరంబనుట. *—

(౩) ఆశంక.

దేవుడున్నాడని నమ్మువారుచెప్పెడు నిర్వచనము చాలనిదిగా నుండుటచేత, నాకేమియు బోధముకాలేదని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఇదిసరియైనమాటగానున్నది-ఏలనంటెయీచేతనాచేత నమిశ్రితచిత్రవిచిత్రప్రపంచము నున్నతనముత్నమునకు భిన్నముగాకొన్నివిషయములలో కలిగెఫలప్రాప్తియును, చూచియీయనుమాన ప్రమాణములచేత, కర్తయైనదేవుని నిర్ణయించవలశినదిగా నుండునపుడు, యీవల్లక్షణలక్షిత బ్రహ్మమును, సప్రకారముగ, ననుమాన ప్రమాణముచేత నూహించుట సాధ్యముగాక, నాకుబోధకాలే దనుచున్నాడు— అయితే పైరెండను మానములచేత కర్తయైన బ్రహ్మమును మాత్రము యంగీకరించక విధిలేదు.—

—*{ సర్వజ్ఞత్వసర్వశక్తత్వాములచేదేవుడు మనుజునికంటెవిలక్షణుడనుట. }*—

(౪) ఆశంక.

దేవుడు నాకంటెభిన్నమైవిలక్షణమైన వస్తువని చెప్పుపక్షమున నట్టిదేవుడుండలేడని నేనుదృఢముగాచెప్పుచున్నాడను—అయితేఒకవిధమైన వస్తుత్వముమాత్రము నంగీకరించుచున్నానని నాస్తికుడుచెప్పుచున్నాడు- ఆస్తికుడు తనదేవుడు యీజగత్తుకంటెభిన్నమై విలక్షణుడైనవాడని చెప్పుచు ఆదేవుడు సర్వజ్ఞత్వ- సర్వవ్యాపకత్వ- సర్వశక్తత్వ- నిత్యత్వ- పూర్ణత్వ-ఈశ్వరత్వములు మొదలగు మంచిగుణములు

గలవాడని చెప్పుచున్నాడు- నాస్తికుడట్టివాడు లేడని చెప్పుచున్నాడు- ఏలననగా దేవుని నిర్విఘముగా- నిర్వచించుట పూర్వాపరవిరోధముగాను- మనుష్యునియొక్క ప్రతిదినానుభవమునకు విరోధముగానున్నది అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఇది యేమి పిచ్చిమాట ఎట్లనగా ప్రతిదినవుదనయనుభవమును బట్టి యచింత్యశక్తులుగల దేవుని నెట్లునిర్ణయించనగును- ఆదేవునిసృష్టిలో జేరిన కించిజ్ఞుడైన జీవుడు సర్వజ్ఞుడు సర్వశక్తుడునగువాని కార్యమైన ప్రపంచపదార్థములలో నొకదానినైనా, సప్రకారముగా గనిపెట్టగలడా, ఇకదేవుని నెట్లు కనిపెట్టనగును-తనకంటెభిన్నమైనవస్తువుకాదనియు నొక్కటేవిధమైన వస్తుత్వమునుమాత్రమంగీకరించుచున్నానని నాస్తికుడు చెప్పుచున్నాడు- తానుజగత్సృష్టి జేయగలడాయిందువల్ల తనకంటె విలక్షణపదార్థము దేవుడని, యేలతోచదు.—

—* దేవునివలన బ్రపంచసృష్టినాశములు గలుగుచున్నవనుట. *—

(౨) ఆశంక.

దేవుడనగా సృష్టికర్తయని ఆస్తికుడు చెప్పితే నాస్తికుడుసృష్టియనునదియే అసాధ్యమని చెప్పుచు, వస్తువువృద్ధిపొందుటగాని కొరతయగుటగాని యవగాహనకాకయుండగా నేమిలేకుండుటనొకవస్తువు క్రొత్తగాబుట్టినదను నదియెట్లుబోధకువచ్చును - అసత్తుసత్తగుటగాని- సత్తుఅసత్తగుటగాని సాధ్యమైనదికాదు సృష్టియనుపదమునకున్ను- లయమను పదమునకున్ను స్థితిభేదమనునర్థముతప్ప- వేరెయేయర్థమున్నులేదు - ఎట్లనగానీవుబంగారుంగరమును గరగించిరూపమునాశనముచేసితె యారూపము మారుటెగానివస్తువునశించుట కాలేదనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

## ఉత్తరము.

నాస్తికుడు సృష్టి యనునదియె అసాధ్యము ఏలనన గావస్తువృద్ధి బొందుట గాని, కొరత యగుట గాని, యవగాహనకు రాలేదని చెప్పు చున్నాడు - స్త్రీపురుషులు కలసితే, వీర్యము కలిలముగా స్త్రీగర్భ ములో ప్రవేశించి వృద్ధిబొంది శిశువుగ నుత్పన్నమై బహుకాలము బ్రతికి యింద్రియ పాటవములు క్షీణించి మృతి బొందును ఈ ప్రత్యక్షములు చూచివృద్ధి క్షయములు అవగాహన కాలేదను బుద్ధిమంతునికి ఆస్తిక లుయేమిసమ్మతి చెప్పగలుగుదురు- మరియు నేమిలేకుండె యొకవస్తు వుక్రొత్తగా బుట్టినదన్నునది యెట్లుబోధకువచ్చునని, నాస్తికుడు చెప్పు చున్నాడు- ఇదియేమిపిచ్చి బుద్ధిలేనివాడు తనకుజ్వరమువస్తె అందరిని నీకు జ్వరము వచ్చినదా - నీకజ్వరము వచ్చినదాయని యడిగినరీతిగా దానుదేవుడు లేడనిచెప్పిన మాత్రము చేతనే యేమిలేక యొకవస్తువు యెట్లుపుట్టినదని దేవుడున్నాడని చెప్పేఆస్తికుని నడుగవచ్చునా యే మి- యెందుకులేదు—దేవుడున్నాడు వానివల్లప్రపంచము బుట్టినదిఅ యితెసత్తువల్ల అసత్తుపుట్టునా అసత్తువల్ల సత్తుపుట్టునా అని అడుగు తాడు- యీయాక్షేపము పూర్వము పురుషుని రేతస్సు స్త్రీగర్భము లోప్రవేశించి, అచేతన పంచభూత మయమైన శరీరముగాను, జ్ఞానే చ్ఛా క్రియలతో చేరినచేతన స్వరూపుడైన జీవుడుగాను- మేళనమై పు ట్టుట, మనము జూచుచు నుండిపై యాక్షేపము చేయుటకు నాస్తికుని కినెట్లుతోచునో యోచించుడు.—

నాస్తికుడు సృష్టియను పదమునకున్ను లయమను పదమునకు న్నుస్థితిభేదమను నర్థము తప్ప వేరే యేమియులేదు - దృష్టాంతము- బంగారుంగరమును కరగించి నాశముచేసితే దానిరూపము మారుటె గానివస్తువు నశించుటకాలేదు- అనిచెప్పుతాడు.—

ఉత్తరము.

అందరికి ఆశగానుండు బంగారుసంగతి తెలిసియుడుగు తావు గానితక్కిన వస్తువుల స్వరూపమే యెరుగడు - ఎట్లనగా- బంగారుకఠినమైన పదార్థము గనుక దానినాశము త్వరగా దెలియ ఒడదు బంగారుభూమిలో నెత్తేది, యెత్తుచున్నారు-అదినాశము కాకపోతే, బహుకాలము నుండియుండిన, బంగారంతయు నిల్చి, భూమియంతయు బంగారుతో నిండియుండును- మంచిది- మరియొక దృష్టాంతమును చూపుతాను- దీపముమలిపితే నాశమగుచున్నదే బంగారుంగరము కరిగితే మరియొక యాభరణమునకు బనికివచ్చినట్లు దీపము ఆరినవెనుక దీపము ప్రకాశతకు పనికివచ్చునా- నాశమనగా మూడువిధములు(౧)వస్తువు రూప నామములు చెడిపోతే మరియొక యుపయోగమునకు రాకుండుట, దీపాదులు(౨)రూపములు చెడితే,తిరుగాఅదెవస్తువుగా, కాకుండుట, జీవశరీరాదులు(౩) రూపము చెడినను, అదేపనికి, నుపయోగించుట, సువర్ణాదులు- ఇవికఠినమైన పదార్థముగనుక నుపయోగస్వరూపనాశనము తత్కాలములో కనుపించదు.—

—* దేవునికి జగత్తుకు విశేష్యవిశేషణ భేదమనుట. *—

(౬) ఆశంక.

దేవుడు ప్రపంచమును సృజించినాడని చెప్పుచున్నయాస్తికుడు దేవుడు దానినితనలోనుండి చేసినాడనిగాని భావమువల్ల చేసినాడనిగాని చెప్పవలెను -తనలోనుండిచేసినాడని చెప్పెపక్షములో దేవునికిజగత్తుకు భేదములేకపోవలయును-అప్పుడప్పుడువస్తుభేదములేకపోవుటచేత సృష్టియనునది లేదు-అభావములోనుండి జగత్తునుచేసెననియు జెప్పరాదు- యేలనంటే దేవుడు నిత్యుడనియుఁ బరిపూర్ణుడనియు ఆస్తికుడె చెప్పుచున్నాడు - భగవంతుడు నిత్యుడై, పరిపూర్ణుడై,

యుండగా భగవంతుడు లేనిచోటునుండి జగత్తు సృజింపబడిన దనియె ట్లుచెప్పవచ్చును అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

తనలోనుండి జగత్తును చేసితే దేవునికి జగత్తుకు భేదములేదని నాస్తికుడుచెప్పుచున్నాడు- ఆస్తికునిమతము తెలియక నాస్తికుడుచెప్పుమాట గానున్నది.—

ఏలనంటె, దేవుడు, సర్వశక్తులు గలవాడని, యాస్తికుడు చెప్పుటవినుచునే, యుండెనే, ఆయనశక్తియను పదార్థముచేత కల్పించినాడని, యేలయూహకురాదు—అక్కడికి శక్తిమంతునికి శక్తికివిశేషణవిశేష్యభేదమే యుండెనే- జగత్తుకు దేవునికిభేదము ఏలలేకపోవును- దృష్టాంతము - వకమనుష్యుడనేక సంగతులలో విశేష శక్తిగలవాడుగానుండి వృద్ధాప్యములో, నతనికె యాలాటిశక్తులులేకుండ నుండుట, మనము చూడలేదా, అదేప్రకారముగ, దేవునికి దేవునిశక్తికి, భేదమున్నది - అయితే నిత్యుడుగనుక శక్తిదౌర్బల్య మెప్పటికి దేవునికి గలుగదు-మఱియు నభావములోనుండి జగత్తుపుట్టునా అట్లుజగత్తును దేవుడు చేసెననిచెప్పరాదు - ఏలనంటె - దేవుడునిత్యుడు పరిపూర్ణుడని ఆస్తికుడుచెప్పుచును, భగవంతుడు లేనిచోటునుండి జత్తునుసృజించినాడని యెట్లుచెప్పవచ్చును అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

భగవంతుడు లేనిచోటులోనుండి జగత్తుచేసినాడని యాస్తికుడుచెప్పలేదు - దేవుడు తనజ్ఞానేచ్ఛా క్రియాశక్తులచేత జగత్తుచేసినాడని చెప్పుచున్నాడు—ఆపక్షములో దేవునిపరిపూర్ణతకు లోపమురాదా, పరిపూర్ణబ్రహ్మమునందుండు శక్తులకునెక్కడ అవకాశము- అట్లుంటెపూర్ణతకు విరోధమురాలేదా, యనిచెప్పేమా

టకేవలము, పదార్థవిద్య తెలియని మూర్ఖతగానున్నది - యిందు కులోక దృష్టాంతము దీపముంచితే ఆకొట్టిడియందు ఆదీపప్రభపూ ర్ణముగా వ్యాపించియుంటున్నది అక్కడమరియొకదీపముగాని య నేకదీపాలుగానిపెట్టితే-ఆదీపముల ప్రభఆకొట్టిడిలో వ్యాపించలేదా, వాట్లపూర్ణతకు విరోధమువచ్చినదా - యిట్లఅచేతనపదార్థము, లోకదానియందొకటి వ్యాపించి తమపూర్ణతకు హానిలేకుండనుండు నపుడు పరిపూర్ణ పరమాత్మయందు ఆయనశక్తులు ఆయనయందు సర్వత్ర యేలవ్యాపించియుండగూడదు ఆశక్తులవల్ల ప్రపంచము నేల సృజించకూడదు అయితే చైతన్యమువలన చైతన్యమెపుట్టవలెను-అచై తన్యమువలన నచైతన్యమెపుట్టవలెనే; చైతన్యమైన బ్రహ్మమందునచై తన్యమెట్లుపుట్టునని నాస్తికులందురు - అచింత్యశక్తులుగల దేవునిసం గతియిట్లుండనిండు - మనకుగానవచ్చు విషయములలో నూర్ణనాభి, తనశక్తివలనతంతు సృష్టిచేసితిరిగి తనయందే, లయింపజేసినట్లుసత్తు లోనుండి యసత్తుపుట్టవచ్చును.—

జనకములేని ఆదికారణమైన బ్రహ్మము ఆయన
శక్తులయొక్క మేళనమె ప్రపంచమనుట.

(౭) ఆశంక,

జగత్తుకు నెచ్చటనుండి యారంభము ఇదిముందులేక యిప్పు డు జనించినదనిగాని, జనించిమరల లేకపోయినదనిగాని, చెప్పుటకు సాధ్యముకాదు- ఏలనంటె- జగత్తులో గనుపడునవియన్నియు జన్య జనక సంబంధముగలవి - యేదిజన్యముగానున్నదో అదిజనకముగాను న్నది - యెట్లనగా - గతించినదాని యొక్కజన్యము ఆగామిగాబుట్టు దానికి జనకముగానున్నది- జనకములేకయే, కారణమనునదియొకఫల ముగలుగుటకు ఆవశ్యకమైన యావత్తుసామగ్రియు పూర్వపుట్టుటకు

గావలసిన యావత్సామగ్రిని దెలియ జేయునదియె కారణమనబడు ను అని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

వారు యేదిజన్యముగానున్నదో ఆదెఆగానికి జనకముగానుం టున్నదని యొప్పుకొనుచున్నాడు యీయుక్తిచేత ఆదికారణముండవ లసినట్టు లేర్పడుచున్నది—మరియు జనకములేని కారణమనునది, యొక ఫలముగలుగుటకును మార్పుపుట్టుటకును గావలసిన యావత్సామగ్రి యు దెలియజేయునదియె, కారణమనబడునని, వాడె, యొప్పుకొను చున్నాడు- ఆపక్షములో ఆసామగ్రికర్తను సాపేక్షించుచున్నది-కర్త దేవుడు, సామగ్రి ఆయనశక్తులు ఇందువల్లజగత్తుకు దేవుడు అభిన్న నిమిత్తోపాదాన కారణము- ఇందువల్లకర్తదేవుడు శక్తులుజగత్తుకు ఉపాదానకారణము- ఈపక్షములోకార్యమైన ప్రపంచపదార్థము లు నశించుచున్నవనిచెప్పితివె- కారణభూతమైనదేవుని శక్తులునశించు చున్నవాయనియంటె, కార్యభూతమైన ప్రపంచమునకు నామరూపము లు నశించుచున్నవెగాని, నిత్యమైకారణమైనదేవుని శక్తులకు నాశము లేదుగాని, స్వర్ణకారుడు తనయిచ్ఛాధీనముగ స్వర్ణమును గటక కుండలాదులుగా మార్పుచేసినట్టు, దేవునియిచ్ఛాధీనముగా, మార్పు లగుచునున్నవి.—

{ జ్ఞానేచ్ఛాక్రియా శక్తులుగల పరిపూర్ణ బ్రహ్మమే జగత్కారణమనుట. }

(౮) ఆశంక.

జగత్సృష్టి యావశ్యకమని వాదించునట్టి ఆస్తికుడు యీప్ర పంచములేనికాలమును వొప్పుకోవలసియున్నది ఆకాలములో, నేదో వకటియుండవలయు, లేనియెడల, నభావములోనుండి యేదియుగలు

గదు - ఆవస్తువు పరిచ్ఛిన్నముగానుండెనేని దేవుడుజాలడు అపరిచ్ఛిన్నమయ్యెనేని సృష్టియనునది యసాధ్యము- యేలననగా బరిపూర్ణమైనదానితో మరియొక్కటియు గూడాకల్పుటయనునది యసాధ్యమని నాస్తికుడు చెప్పుచున్నాడు.——

ఉత్తరము.

జగత్సృష్టికి పూర్వకాలమును నొప్పుకొనవలెను ఆకాలములో యేదో యొకవస్తువుండవలెను - లేకుంటెఅభావములోనుండియేదియు గలుగదనియు నొప్పుకొనుచున్నాడు- అయితే ఆవస్తువు పరిచ్ఛిన్నముగానుంటెదేవుడు కాజాలడనిచెప్పుచున్నాడు-యిందుకు ఆస్తికుడువొప్పుకొనుచున్నాడు. అయితే అపరిచ్ఛిన్నుడుగానుండెనేని సృష్టియనునది యసాధ్యము - ఏలననగా పరిపూర్ణమైనదానియందు మరియొకటి కల్పుటయెట్లనిచెప్పుచున్నాడు——యీయుక్తి పిష్టపేషణమువలె పలుమారు వ్రాయుచున్నాడు - పైనవ్రాసీన సమాధానములలో పరిపూర్ణుడైనబ్రహ్మముకంటె వేఱుగమరియొకటిలేనేలేదే, యెట్లుకలుపనగును అయితే దేవునియందుజ్ఞానేచ్ఛాక్రియాశక్తులున్నవి- ఆశక్తులు వ్యాప్తముగానెట్టులిమిడి యున్నవనుటకు దీపదృష్టాంతము చూపెయున్నాము-మరియుదప్తాయః పిండములోనగ్నికినెట్లవకాశము కలిగినదో అగ్నిలోవాపిండముల కేకత్రియెట్లుస్థితి యేర్పడినదో అదేరీతిగభగవంతునికిన్ని ఆయనశక్తులకున్ను సంబంధము కలిగియున్నదియిందువలననేడవ కలములో వ్రాసిన ప్రకారముగదేవుడు తనశక్తులచేత ప్రపంచమునేల సృజించగూడదుకాబట్టి జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు గల దేవుడేసృజింపవలెను.——

—* { కర్మానుగుణముగాజనులకు రక్షాశిక్షాదులు చేయుటచే దేవుడు జగత్పాలకుడనుట. } *—

(౯) ఆశంక.

జగత్సృష్టివాదమును వదలితత్వాలసత్వము గలవాడు దేవుడని చెప్పునపుడు తీరరానిసంశయములున్నవి- జగత్తులో జెడుయనుపదార్థమునకు ఆస్తికుడు కారణము జెప్పజాలకున్నాడు-యేమనగాదుఃఖము నేరము దౌర్భాగ్యముదారిద్ర్యము మొదలగునవి దేవుడు అన్నివిషయములలో మంచివాడు అన్నితెలిసినవాడు సర్వశక్తిగలవాడు అనిచెప్పువారిమాటకు విరోధముగానున్నవి దేవునివలనబుట్టినవిగాగానిస్వతంత్రముగానుండునవిగాగాని యుండవలయు దేవునివల్లపుట్టినవైతే దేవుని మంచితనమునకు హానిగలుగుచున్నది - స్వతంత్రముగానుండెనేని దేవుని సర్వశక్తికి హానిగలుగును మరియునీచెడు అనునదియాదిగలదిగాగాని అనాదిగాగాని యుండవలయు నయితే దేవుడొక్కడేయనాది యనుటవలన, నది, యనాదిగానుండజాలదు- యిందువల్లవాటికి నుత్పత్తియు నుండవలయు నుత్పత్తియుండినయెడల, దేవునిలోనుండిగాని, అతనికి వెలుపటనుండిగాని పుట్టియుండవలయు మంచిస్వరూపమైన దేవునిలోబుట్టదు- దేవుడు పరిపూర్ణుడగుటచేత అతనికివెలపలబుట్టుటయులేదు అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఈనాస్తికుడు పూర్ణమైన యాస్తికపండితునివల్ల తత్వములను తెలుసుకొన్న వాడుగాడు- ఎట్టివానివల్ల తెలుసుకొనెనంటె దేవుడు మంచినే చేయుచున్నాడని చెప్పుతమవేదమే ప్రమాణమని మతపిచ్చిపెట్టుకొన్నవానివల్ల తెలుసుకొన్నవాడు-ఇందువల్ల జగత్తులో జెడుపదార్థమునకు ఆస్తికుడు కారణమును జెప్పజాలక యున్నాడనియు దేవుడన్ని విషయములలో మంచివాడనిన్ని- తెలిసినవాడును సర్వశక్తి గలవాడును నయితే దుఃఖమునేరము దారిద్ర్యము మొదలగునవి యెట్లుక

లుగజేసెను- దేవునివలన బుట్టినవైతే దేవుని మంచితనమునకు హానిగ లుగుచున్నది అనియనుచున్నాడు- ఇందుకు దేవుడు సర్వశక్తిగలవాడు గనుకనే, తనసృష్టిలో దారిద్ర్యముంటేనేగాని, భాగ్యమునకు బ్రయోజనంబును, దుఃఖ ముంటేనేగాని సుఖమునకు బ్రయోజనంబును, నేరముంటేనేగాని శిక్షకు బ్రయోజనంబును, శిక్షయుంటేనేగాని భక్తులరక్షించుటకు బ్రయోజనమును గలుగును కాబట్టియిట్టివి, దేవుడేర్పరచకపోతేదేవుడే కాడుయెట్లనగా - గౌనరుమెంటువారు, నేరముచేసినవారికి, దండనయు మంచిచేసినవారికి సంబళము వృద్ధిజేయుటయు, చేయుచున్నారు- యిందువల్లనే, జనులనుపాలించే వారగుచున్నారు-దేవుడురక్షా శిక్షాదులను జేయుటకు యేర్పరచి విధి నిషేధములను తెలిపినాడా యనిఅంటె- అట్లులేదు - ఇకనెట్లంటె-రక్షాశిక్షాదులు పొందుటకు ఆయాదేశములలో పండితులు అచ్చటి విద్యమానమును బట్టియేర్పరచుకొన్న సదసత్కార్యములు జేయుటయే- అందరికిదండ్రియైన దేవునికోప ప్రసాదములకు హేతువగుచున్నది- అనిఆస్తికుడు చెప్పుచున్నాడు - యెట్లనగా దేవునియందు ఆస్తిక్యబుద్ధి గలవాడునట్టి యసత్కార్యములను జేయడు - యిందువల్ల ప్రసాదము కలిగి రక్షించుతాడు- దేవుడులేడనే నీవంటివాడు పాపభీతిలేక యట్టిచెడ్డ కార్యములుజేయుటవలన దేవుడుకోపముగల్గి శిక్షించుతాడు.—

## రహస్యదోషములుచేయకుండుటకుఆస్తిక్యమేమూలమునాస్తిక్యముకాదనుట.

## (౧౦) ఆశంక.

నేరము చేయకుండుటకు ఆస్తిక్యము ఆవశ్యకమని కొందఱుచెప్పెదరు నాస్తికుడుఫలభీతి యేమిలేకచంపుట, అనృతమాడుట, దొంగలించుట, మొదలగు నవిచేయగలడని యాస్తికులుచెప్పెదరు.—

ఆస్తికులు దొంగలించడము మొదలయిన పనులుచేయరా, చేసితే దేవునియందు నమ్మికలేకపోయెను వానినిశిక్షించుటకు దేవునికిశక్తియును లేకపోయెను- యిట్లువాదించువారు నేరమునకు వాస్తవకారణమెరుగనివారు- అందరుత్తమ సుఖమునుగోరి పలుపలు విధములుగా ప్రవర్తించెదరు - చదువులేక జ్ఞానహీనులైనవారు సుఖమునకు వాస్తవమార్గమును తెలిసికొనలేక నేరములను జేయుచున్నారు - సుఖసంపాదనకుసరియైన మార్గమును జనులకు తెలుపుటవలన లోకములో. నేరములేక యుండునట్లుచేయవచ్చు- సన్మార్గప్రవర్తనలో నుండుట యీలోకములో నిప్పుడే సుఖమును గలుగజేయును చెడుమార్గములోప్రవేశించితే దుఃఖమూలమగుచున్నది అనినాస్తికుడు చెప్పుచున్నాడేగాని ఆస్తికుడు చెప్పేలాగున చచ్చినవెనుక మనుష్యునకు దేవుడుమంచినిగాని, చెడునుగాని,గలుగజేయుచున్నాడని,నాస్తికుడుచెప్పడు, అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఆస్తికుడు నేరముల జేయలేదా అనివ్రాసినందుకు నేరములకు ప్రాయశ్చిత్తము చేసికొనని ఆలాటివాడు ఆస్తికుడుగాడు నాస్తికునితమ్ముడు- అయితేఅప్పుడే శిక్షించుటకు దేవునికి శక్తిచాలదాయని వ్రాసినందుకు దేవుడు తనసృష్టిలో రాజులుయేర్పడి యుండునపుడు నేరస్తులనప్పుడె దేవుడుదండించితే రాజులతో ప్రయోజనమేమి , అట్లయితేరాజు దుర్మార్గుడైతే రాజునుశిక్షించి నాడాయనియుంటె, అట్టి రాజులరాజ్యమును వారలపరములోనే దేవుడు స్థిరముగా నుంచలేదు- మరియునెవరైనా నేరముచేయునెడల తత్కాలములో శిక్షించు నెడ నాస్తికులే లేకపోదురు - ఆపట్ల దేవుని లీలాప్రభుత్వములో శిష్టారక్షణాదులకవకాశములేక పోవును- మరియు నరమృగపశుపక్షివృక్షపా

షాణాది నీచోచ్ఛజన్మములు కలిగించుటకు హేతువైన పుణ్యపాపములులేకపోవును యిది దేవుడు తానే, కలుగజేసినాడంటె పక్షపాతమువచ్చును యిందువల్ల దేవుడు అప్పుడేశిక్షించడు - మరియునిట్లు వాదించువారు నేరమునకు వాస్తవకారణమెరుగరు- అందరుతమసుఖమునుగోరి పలువిధములుగా ప్రవర్తించెదరని, నాస్తికులు వ్రాసినారు- యిట్లువారు చేయుటయెనిజము- యెట్లనగానాస్తికులు తమసుఖమునుగోరి తల్లితోడబుట్టువులను పశువులవలెవిషయించుచు రాజదండనకు పట్టీకుగాని జారచోరత్వాదులుచేయుచుతమసుఖమును హెచ్చుగానార్జించుచున్నారు- ఆస్తికులులోకాంతరము జన్మాంతరములో దేవుడు శిక్షించునని రహస్యముగానైనా పాపములుజేయక యెగువవ్రాశిన సుఖములను బోగొట్టుకొనుచున్నారు - యింతేగాక ఆస్తికులుచదువులేక జ్ఞానహీనులైనవారు సుఖమునకు వాస్తవ మార్గమును దెలిసికొనలేక, నేరములుచేయుచున్నారు సుఖసంపాదనకు సరియైన మార్గమును జనులకు దెలుపుట వలన లోకములో నేరములేకుండాజేయవచ్చునని నాస్తికుల యభిప్రాయము - సన్మార్గ ప్రవర్తనలో నుండుటయీలోకములో నిప్పుడెసుఖమును గలుగజేయును- చెడుమార్గములో ప్రవేశించితే యిప్పుడె దుఃఖమూల మగుచున్నదని నాస్తికాభిప్రాయము- ఆస్తికుడు చెప్పేలాగున చచ్చినవెనుక మనుష్యునకు దేవుడు మంచినిగాని చెడునుగానిగలుగచేయు చున్నాడనిచెప్పడు.—

ఉత్తరము.

లోకములో సుఖసంపాదన మార్గమును జనులకు దెలుపుటవల్ల లోకములో నేరములు లేకయుండునట్లు చేయ వచ్చునని నాస్తికులు చెప్పుతారే, ఆప్రకారముగా ఆలాటిచదువు- వారుచెప్పుటలేదా- అధికారులు చెప్పించుటగాని కనుపించదు-వారిగ్రంథములంతమేలైనగ్రంథ

ములైతే యేల ప్రచురముకాదు- అందరివంటి వాడేయితడు అధికమే మని రిష్యాదేశము జాల్‌గారిని, గుండ్లు వేసిచంపి అందరు రాజ్యమును చేయవచ్చును అనియీలాటివి నాస్తికులు చెప్పి చంపిరిగాని ఫలమునుబొందకశిక్షబొందిరి ప్రపంచములో బహుకాలముగా ప్రాయశః ఆస్తికులుగానుండేదొరలే భూమిని పాలించిరిగాని నాస్తికులు పాలించినవారుగారు- మరియు అధికారులు దేవునియందు ప్రమాణముచేయించి వాఙ్మూలము మొదలయినవి తీయుచున్నారు- ఇందువల్ల ఆస్తిక్యమే మంచిమార్గమని బుద్ధిమంతులు తెలుసుకొనవచ్చును.—

{ మనుష్యులకుబుద్ధియుగొంతస్వాతంత్ర్యమునుభగవంతుడిచ్చియుండుటవలన కర్మానుగుణపుణ్యపాపఫలభోక్తలువారేయగుచున్నారనుట. }

(౧౧) ఆశంక.

దేవుడు జగత్తును సృజించి తన యిచ్ఛ వచ్చినట్లు పాలించుచున్నాడని ఆస్తికుడు బోధించుటవలన మానవుడేవిధమైన యుద్యోగమునుజేయక చెడిపోవుచున్నాడు- నాస్తికవాదము ప్రపంచముయొక్క స్థితికొన్ని నిబంధనలకు లోబడినదిగా దెలుపుటవలన మానవుడుతనసుఖమునకు ముఖ్యకారణముల తెలిసికొని సన్మార్గ ప్రవర్తన గలవాడై యుండగలడు అనినాస్తికుడంటాడు.—

ఉత్తరము.

ఆస్తికుడు దేవుడు ప్రపంచమును తానుచేసి మనుష్యులకుకొంత స్వాతంత్ర్యమివ్వక యావత్తుకుదానె ప్రేరకుడుగా నుంటాడని తెలిసిన ఆస్తికుడుచెప్పడు- దేవుడచింత్యప్రపంచమును సృజించి మనుష్యులకు బుద్ధియుకొంత స్వతంత్రమును యిచ్చియట్టి స్వతంత్రమువలన వాడుతన మేలుకొరకు కొన్ని కార్యములు చేసికొని లౌకికఫలమును బొందుచుం

డుట యనుభవములో నుండగా మనిషి అట్టి యస్వతంత్రుడని యెట్లు చెప్పనగును వినువాడెట్లువినును, కాబట్టితనకు దేవుడిచ్చిన శక్తితోప్ర యత్నముచేసికొన్ని సిద్ధిపొందగలడు కొన్నిసిద్ధిపొందజాలడు- ఏలనం టె అట్టిఫలమును దేవు డిచ్చుటకు అదృష్ట ప్రతిబంధక మున్న యెడల పొందచాలడు యీవిషయములలో నాస్తికుడు మనకు తెలియనిసూక్ష్మ ప్రతిబంధక కారణములుండి నందునఫలము పుట్టలేదు అది తెలియకయా స్తికులుఅదృష్ట ప్రతిబంధకమువలన దేవుడాఫలము నీలేదని చెప్పెదరని నాస్తికులు చెప్పుచున్నారు - అదిసరికాదు - మనకు తెలియని సూక్ష్మ ములైనప్రతిబంధక కారణములున్న వనుటకేమియుక్తి అట్లనుటకంటె మనము ప్రయత్నముచేయని ఫలములు దేవుడిచ్చుచునుండుట చూచుచు న్నాముగనుక ప్రయత్నవిషయములో ప్రారబ్ధ ప్రతిబంధకమువలన దే వుడుకొన్ని ఫలముల నీలేదని చెప్పుట యనుభవమునకు సరిగానున్నది- అట్లులేక మనప్రయత్న లోపముల వలనకార్యము కానట్టులయితే అ ట్టి లోపములు రాకుండ నాస్తికుడుకనిపెట్టి వ్యర్థము కాకుండ ప్రతి కార్యమునకు ఫలమును బొందవచ్చును అట్లుపొందుచున్నాడా తనయ త్నములేకనే, జరుగుకొన్ని ఫలములకేమి కారణములు చెప్పగలడు-అ యితేదేవుడే లేడని చెప్పవలెనని దురహంకారాను భావములైనపిచ్చి యుక్తులు కొన్నిచెప్పును- ఆయుక్తులు అట్టిపిచ్చివాడె వినవలెను- ఏల నంటె యనుభవమునకు విరుద్ధముగా జెప్పితే యెవడువినును.—

చావబోవువానికినను తాపము
వల్లప్రయోజనములేదనుట.

(౧౨) ఆశంక.

మహా పాపిగానుండు వాడుతాను మరణావస్థలో నను తాప పడితె పాపశాంతిగలిగి భవిష్యత్సుఖము కలుగు చున్నదని యాస్తికు

డుచెప్పుచున్నాడు- గానిమానవుడు సాధ్యమయిన వరకు చక్కగాప్ర వర్తించితే అనుతాపము జెందవలసినది లేకయిక్కడనే సుఖముపొం దుతాడు- అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఈరెండుమాటలు అవ్యక్త ప్రలాపములేను- యాలనంటె పాపములుజేసి యనుతాపపడితే ముందుఆలాటి పాపముల జేయకుండుట కునుపూర్వము చేసుకొన్నవాటికి ప్రాయశ్చిత్తము చేసు కొనుటకును కారణమగునుగాని చావబొయ్యేడు వారికది యుపయోగములేదు నాస్తికుడుతాను చక్కగాప్రవర్తించితే యనుతాపము బొందవలశినదిలేదుయిక్కడనే సుఖము పొందుతాడని వ్రాయుచున్నాడు—నాస్తికునికిపాపమేలేదే చక్కగాప్రవర్తించ వలశిన దెందుకు- మరియుచక్కగాబ్రవర్తించితే యనుతాప పడవలశినదే పనిలేదు- యిక్కడనేసుఖముజెందునని వ్రాయుచున్నాడే చావబోవువాడు ఇక్కడసుఖమును వెనుకపొందుటయెట్లు, కాబట్టి యిదియునున్మత్త ప్రలాపము.

{ నాస్తికులైనను శరీరతత్వజ్ఞానమువలన రోగాదులు రాకుండతప్పించుకొనజాలరనుట. }

(౧౩) ఆశంక.

దేవుని కోపమువలన జగత్తులోవ్యాధి మొదలయినవి గలుగుచున్నవి కాబట్టిక్షమతో వానినోర్చవలెనని యాస్తికుడు చెప్పుచున్నాడు అయితే శరీర తత్వజ్ఞానమువలన వ్యాధులు రాకుండ జేయవచ్చుననియు అవిదేవుని కోపమువలనబుట్టినవి కావనియువానికి గాలిలేనియిండ్లలో, నివాసము చెడినయన్నము తినుటయు, అధిక దేహాయాసము, మానసిక చింత, చెడ్డగాలిలోనుండుట, మొదలయిన వికారణములు - స్తోత్రము

భక్తియు జ్వరవారకములుగావు- ఆస్తికుడుగాని నాస్తికుడుగానిఅన్నములేకయుంటె తప్పకచచ్చును - అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

దేవుని కోపమువలన రోగములు పుట్టుచున్న వనుటకంటె దేవుడుగలుగజేసిన వస్తుస్వభావముల వ్యత్యయములవలన రోగములుపుట్టుచున్న వనుటమేలు అయితే దానికి ప్రతిక్రియలుదేవుడు గల్పించియుండు నౌషధముల సేవించుటయు దేశముమార్చుటయు మొదలయిన పనులు చేయవలెను—నాస్తికులు శరీర తత్వజ్ఞానము వలన వ్యాధులురాకుండ జేయవచ్చుననియు నట్లురోగములు వచ్చుటకు గొన్నికారణముల జెప్పుచున్నారు-ఆలాటివి వారు శరీరతత్వజ్ఞానము వలనను రోగములు వచ్చుటకు తగినకారణములు గుర్తెరిగి తప్పించుకొని పుట్టినది మొదలుకొని(౧౦౦)సంవత్సరముల పర్యంతముచచ్చేవరకు రోగములు రాకుండ చేసికొనుచున్నారాలేదు ఆస్తికులవలెనె నాస్తికులు రోగపీడితులై యౌషధ సేవాదులవలన నారోగ్యమును బొందుచున్నారు - ఈశ్వరుడునిర్ణయించిన కాలముతీరితే యౌషధములవలన ప్రయోజనము పుట్టక చచ్చుచున్నారు - అట్టులీశ్వర నిర్ణయములేకపోతే మనుష్యునికి ప్రమాణమైన (౧౦౦) సంవత్సరములు రోగములు రాకుండజేసికొని బ్రతుకవచ్చును—అట్లు నాస్తికులు బ్రతుకుచున్నారా—ఆస్తికుడు నాస్తికుడు అన్నముతినకుంటె చచ్చిపోవును అనివాదిస్తాడు-ఈయాశంకయేలకలిగెనో తెలియదు దేవుడు సృజించిన పదార్థములలోస్వభావములు ఆయాలాగుననుండగా అన్నము తినకుండాయుంటె బ్రతుకనాయనియడుగుట యాస్తికులయందు వారలకుండు కోపావివేకానుభావమేకాని వేఱుకాదు.—

## జగత్కారణము సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదివిశిష్టుడే గాని జడముగాదనుట.

### (౧౮) ఆశంక.

దేవుడు నిర్వికారుడనియు నిర్గుణుడనియు అపరిమేయజ్ఞానముగలవాడనియు ఆస్తికులు చెప్పెదరు- యీపక్షములో మరియు జగత్తు జ్ఞానవంతముగాగాని యజ్ఞానవంతముగాగాని యుండవలయుజ్ఞానవంతమను నెడల జగత్తులో నన్నివస్తువులకు జ్ఞానముండవలయు - నట్లులేదు. కాబట్టి జగత్తుయొక్క ముఖ్యధర్మము అజ్ఞానమగుచున్నది- అయితే జ్ఞానము కూడానున్నది - కాబట్టి యీజ్ఞానమునకు కారణముండ వలయును ఆకారణము జ్ఞానముగల వస్తువుగా నుండవలయు ఆవస్తువే దేవుడు, జ్ఞానమను దానిలో ననేకములగు మానసికధర్మములిమిడియున్నవి- మొట్టమొదట నొకవస్తువును జూడగానే తద్వస్తుత్వము మనంబున స్ఫురించుట, దేవుడు సర్వజ్ఞుడగుటచేత క్రొత్తగా నొకదానిని జూచి గ్రహించుట యనునది యుక్తముగాదు అట్లుగ్రహించుట వాస్తవమయ్యెనేని దేవునియొక్క జ్ఞానము రాగా రాగా వృద్ధిపొందదగినదిగా నుండును- ఇదియతనిపూర్ణతకు హానికరము దేవునికి వెలుపట వస్తువులుండిన యెడల వానిని జూడవచ్చును - వానినిజూచి వానివలన సంతోషము దుఃఖము మొదలగునవి కలుగును - అందుచేత స్థితిభేదము కలుగును భగవంతుడు నిర్వికారుడుగనుక సుఖదుఃఖభోగియెట్లగును అతనికిబహిర్భావమనునది యెక్కడిది పైజ్ఞానము అనునది జ్ఞప్తి వివేకమనునవి, లేక యుండదు- భూతవిషయమైనది జ్ఞప్తి, భవిష్యద్విషయమైనది వివేకము, దేవునికిభూత భవిష్యత్తులెక్కడివి ఆలోచనాశక్తిలేక జ్ఞానముండదు - ఆలోచించుటకు, నాలోచించు వస్తువుకంటె నాలోచింపబడువస్తువు, భిన్నముగానుండవలయును - ఇట్లు వస్తుభేద బుద్ధిచేత వికారముగలుగు

చున్నది- దేవుని నిర్వికారతకుహానిసంభవించుచున్నది. జ్ఞప్తియనిచెప్ప నపుడు, మరుపుగూడ, నథాఽస్తుగా, సిద్ధించును-దేవునికిమరుపుకలదా, పైచెప్పినదికూడియే, జ్ఞానమగుచున్నదికాబట్టి, దేవుడు జ్ఞానము కలవాడనిచెప్పుటతప్పు అతనికి జ్ఞానమేలేదని చెప్పవలసియున్నది అనినాస్తికుడుచెప్పుచున్నాడు.

ఉత్తరము.

ఈకలము మొదల ఆస్తికుడు దేవుడు నిర్వికారుడు నిర్గుణుడు అనిచెప్పుచున్నాడని నాస్తికుడు వ్రాయుచున్నాడు. ఆయాస్తికుడునాస్తికుని తమ్ముడేను - ఫలనంటే దేవుడు సంకల్పాదిగుణములులేనివాడైతే జడప్రాయమే యగుచున్నాడు - అందుమీద నాస్తికుడు చెప్పేయుక్తులకు సమాధానము జెప్పవలసినదిలేదు - దేవుడుజ్ఞానస్వరూపుడు, సర్వశక్తిగలవాడు, పూర్ణుడు, నిత్యుడు, జగత్కారణము, నియామకుడు, ఇట్టివాడు - కావున జ్ఞానముకలవాడేగాని అజ్ఞానుడుగాడు - కాబట్టిమనవలె ఆయనకు మరుపులేదు - ఒక్కొక్క వస్తువును జూచి మనస్సుస్ఫురించుచు రాగా రాగా జ్ఞానము వృద్ధిపొందుటమనకేను- దేవునికికాదు - మరియు జ్ఞానస్వరూపుడైతే ఆయనవల్లపుట్టిన జగత్తు జ్ఞానస్వరూపముగానుండవలయు నట్లులేదు - జ్ఞానాజ్ఞాన మిశ్రితముగా నుంటున్నది అయినప్పటికి జ్ఞానమునకు కారణముండవలయు - నాకారణము జ్ఞానముగలవస్తువుగానుండవలయు, నావస్తువేదేవుడు - అజ్ఞానమనువస్తువందు, ననేకమానసికధర్మము, లిమిడియున్నవనియాక్షేపముగా నైనానాస్తికుడుచెప్పుచున్నాడు - కాబట్టి ప్రపంచసృష్టికి కారణము జ్ఞానస్వరూపముగానివారుచెప్పేజడస్వరూపస్వభావముకాదు. నాస్తికుడు దేవుడు సర్వజ్ఞుడగుటచేత కొత్తగానొకదానినిజూచి గ్రహించుటనునది, యుక్తముకాదని, వ్రాయుచు, నట్లుగ్రహించుట వాస్తవ

మవ్వెయ్యేని దేవుని జ్ఞానము రాగారాగా వృద్ధిపొందదగినదిగా నుం డును - అతని పూర్ణతకు హానికరము దేవునికి వెలుపట వస్తువు లుండినయెడల వానినిజూడవచ్చును - వానినిజూచి దుఃఖము సంతో షము మొదలగునవి గలుగును- అందుచేత స్థితిభేదము కలుగును భ గవంతుడు నిర్వికారుడు గనుక సుఖదుఃఖభోగియెట్లగును - అతనికి బహిర్భాగమనునదియెక్కడిది అనే నాస్తికునియాక్షేపములు అసం భావితములు నాస్తికుడు స్వోక్తివిరోధముగా దురాగ్రహముతోదత్వ ము తెలిసికొనక, వ్రాయుచు, దేవునికి జ్ఞానమే లేదని చెప్పుచున్నాడు. దేవుడు జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు గలవాడు గాకపోతే జగత్తునంతట గలుగజాలదు - అచేతన వస్తువులలో తత్తత్స్వభావము లుండినను- టిల్లిగాపు - పొగబండి - గడియారము మొదలగుశిల్పములు - త త్తదనుగుణమైన జ్ఞానేచ్ఛాక్రియాశక్తులుగలశిల్పి లేకయే, తనంతటగలు గజాలదు- యీయచేతనశిల్పము లేయిట్లుండగా జేతనాచేతనమిశ్రిత మైన యీచిత్రవిచిత్ర ప్రపంచము పరమకర్త లేకయే, ప్రథమమందు, తనంతటగలుగజాలదు - అందులో దేవుడుంచినశక్తులచేత తనంతట వెనుకగలుగుచున్నది- అయితే జ్ఞానేచ్ఛాక్రియాశక్తులుగల పూర్ణబ్రి హ్మమందు ఆచైతన్యాదిగుణము లెట్లులున్న వనగా - నగ్నియందు దాహకశక్తియు, చైతన్యమందువర్ధనాదిశక్తులు జ్ఞానమునందు సం కల్పవికల్పాదిశక్తియునున్నట్లు సర్వశక్తిగలబ్రహ్మమందు యావచ్ఛక్తు లున్నవి.—

ఇందువల్ల వెలుపట వస్తువు లుండవలసిన యావశ్యకములేదు-

అయితే వెలుపటవస్తువులేకపోతే, యెట్లుచూడవచ్చుననియడు గును, మనశరీరభూతమైనవస్తువులను మనము చూచుటలేదా చూడ బడువస్తువులు మనకంటె వెలపలనేయుండవలసిన యావశ్యకమేమి,

పూర్ణుడైన బ్రహ్మమునకు, వెలుపలయనునది యెక్కడిది ఇట్లనే ఆలోచించువస్తువు బ్రహ్మము ఆలోచనీయములు ఆయనయందుండు చేతనాచేత నాత్మకశక్తులు కాబట్టి బ్రహ్మమున కంటె నివి వెలిగా నుండవలసిన యావశ్యకములేదు- నిత్యుడైనబ్రహ్మమునకు భూతభవిష్యత్తులెక్కడివంటే ఆయనసృజించు భూతముల ముందువెనుకనుబట్టి వాట్లకాలమునకు భూతభవిష్యత్తు లేర్పడుచున్నవి.

—※ { సర్వజ్ఞత్వాదులు గల దేవుడే ప్రపంచమునకు నభిన్న నిమిత్తోపాదాన కారణముగాని జడమగు నేచర్ గాదనుట. } ※—

(౧౫) ఆశంక.

ప్రతికార్యమునకు నొకకారణముండవలయు, నన్నింటికి ఆదికారణము సర్వవ్యాపకమై నిత్యమై యుండవలయు, నదియే దేవుడని ఆస్తికుడు చెప్పుచున్నాడు యింనుకు నాస్తికుడు దేనివల్లదేవుడు, ఆదికారణమగుచున్నాడు, కారణమన గానేమి, కారణమనునదినిత్యమైనదికాదు ఒకేకాలములో కారణముగాను కార్యముగానునుండుటచేత నదినిత్యమని చెప్పుటయు క్తముకాదు-పూర్వము యేమియు లేక, అవతలపుట్టినదని చెప్పుటసరికాదుఆదికారణమునునదియే లేదు. ఏలనంటే ఒకేకాలములో గారణముగాను గార్యముగానునుండుటచేత అదినిత్యము కాదని నాస్తికుడు వ్రాయుచున్నాడు. ఉత్తరము.

ఏవస్తువును నొకదానికి, గార్యముగాను తనవల్లముందు పుట్టగలవస్తువునకు కారణముగాను కాలభేదముచేత నేర్పడుచున్నదిగాని యేకకాలములోనొకవస్తువు పరస్పర కార్యకారణములుగా గాని, భిన్నవస్తువునకు గారణముగా గాని, యేర్పడదు - యిదియు పాదాన కారణము.

అయితే ముందువ్రాసిన ప్రకారముగ, ముందుముందు గలుగు

వాటికి, వెనుకటివి కారణము లగుచున్నవి. వీట్లకు నిమిత్తకారణమైన ఆదికారణము వరకుపోతే సర్వకారణ కారణమొక్కటి యుండవలశి నదనిఅందరు నొప్పుకొనవలశినది – అదె నేచర్ అనినాస్తికుడు చెప్పు చున్నాడు. అదిజడముగానుంటె ఘటమునకు కులాలునివలె జగత్తుకు నిమిత్తకారణము కాజాలదని యెగువయుక్తులు వ్రాసియున్నాము. స ర్వజ్ఞత్వ సర్వశక్తత్వాదులుగల యతడే దేవుడు వాడె ప్రపంచమున కునభిన్ననిమిత్తోపాదానకారణము.—

—* { దేవుడువస్త్వంతరాపేక్షలేక, తనపరాపరా ప్రకృతులచేతసంకల్పమాత్రసిద్ధుండనుట.— } *—

## (౧౬) ఆశంక

ఘటమును జూడగానే, దీనినిజేసినవాడొక డుండవలయుననిక్ తెలియునట్టు, ఈప్రపంచమును జూడగానేదీనిని జేసినవాడొక డుండ వలయునని తోచుచున్నదని యానాస్తికుడు చెప్పుమాట బహుదోషగ్ర స్తముగానున్నది. ఎట్లనగా – ఘటమును జేసినవాడు ఘటస్థితికిముం దువుండిన వస్తువులను ఘటరూపముగా జేసెనుఅయితె, భగవంతు, డభావములోనుండి తనకంటె విలక్షణముగా నీప్రపంచమును జేసె నా—తనకంటె విలక్షణమైన వస్తువుండి దానిచేతచేసెనా, యెట్లై నాస రెడుండినట్లుండి హఠాత్తుగా నొకజంతువునేల సృజింపరాదు— ప్రతి జంతువును నాయారూపము పూర్ణముగా బొందుటకు చాలా కాలమగుచున్నది. ఎట్లనగా. మొట్టమొదట తల్లిగర్భమున, పిండమై క్రమక్రమముగా వృద్ధిపొంది పుట్టుచున్నదిగాని తటాలుననేజంతువైె నాపుట్టుచున్నదా. ఇందువల్ల దేవుడు సర్వశక్తిగలవాడని యెట్లుచె ప్పవచ్చును అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

## ఉత్తరము.

ఇందువల్ల నాస్తికుడు విశేష జంతువుల యుత్పత్తులను గనిశించినవాడుగానే, యుండలేదు- వర్షముగురిసిన తోడుతనే,మత్స్యమండూకములు తత్కాలములోనె అండములలో నుండికొన్ని, యుత్పన్నమై అప్పుడే పెద్దవిగా నగుచున్నవా- లేదా - ఆర్ద్రపురుగులు మొదలగు ననేకజంతువులు తటాలున నుత్పన్నమై పూర్ణతను పొందుచున్నవి- వాట్లను అట్లుచేయలేదా - మంచిదితటాలున- పూర్ణమైనస్వరూపము చేయవలెనని, దేవునికి నిచ్ఛగలిగి చేయలేకపోతేఅప్పుడు ఆదేవునికి సర్వశక్తిలోపము గలుగునేగాని, యాయనకునట్టి సంకల్పములేక నాస్తికునకోరు ప్రకారముగ గాకపోయినందున దేవునిసర్వశక్తికిగాని జగత్కారణత్వమునకుగాని హానికలుగునా- దేవుడు అభావములోనుండి జగత్తునుచేసినాడా- వెలపటినుండి చేసినాడా- యనుప్రశ్నకు పూర్ణుడుగానుండి తనలో శక్తులచేత ప్రపంచము చేశినాడను సంగతియెగువ ఆరవకలములో వ్రాసియున్నాము- కాబట్టినాస్తికుని యీయాక్షేపము సరికాదు.—

—* { సూర్యచంద్రాదుల ధర్మములనుబాలించుటకుసర్వ కారణ కారణమైనయీశ్వరుడొక్కడేయునట.— } *—

## (౧౭)ఆశంక.

పరిచ్ఛిన్నకార్యము నాధారముచేసికొని అపరిచ్ఛిన్న కారణముండవలయునని, వాదించునపుడు ఆకార్యమునకు దగినపరిచ్ఛిన్న కారణమొకటి దేలునేగాని దేవుడపరిచ్ఛిన్నుడని యేర్పడదు- ఇందువల్లదేవుడు పరిచ్ఛిన్నుడగుచున్నాడు కాబట్టి యతని జ్ఞానశక్తులు కూడాపరిచ్ఛిన్నములే యగుచున్నవి- యీయనుమాన ప్రమాణము చేత దేవుడుసదా యుండువాడని యేర్పడదు ఆయాకార్యమున

కుఆవశ్యకమయిన కారణము పూర్వభావిగా నుండెనని మాత్రము తెలియును కార్యము లెట్లునాశమును బొందుచున్నవో, అట్లువాట్ల కారణములున్ను నాశనమును బొందదగినవి మరియు దీనిచేత దేవు డొకడెయనియు నేర్పడదు ఒక్కొక్క కార్యమునకు నొక్కొకకారణ ముండవలశియున్నది ఆయాకారణములు దేవుళ్లయితే అనేకదేవుళ్లే యేర్పడుచున్నారని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

పరిచ్ఛిన్న కార్యము నాధారముచేసికొని దానికికారణముండవలయునని వాదించు నపుడా కార్యమునకు దగినపరిచ్ఛిన్నకారణ మొకటితేలుననియు కార్యమెట్లు నశించుచున్నదో యిట్లుకారణంబును నశించు చున్నదనియు ఉపాదాన కారణమునుబట్టియు వ్రాయుచున్నాడు—ఇదిప్రతి వస్తువునకు గలిగియుండు కార్యకారణ ములను బట్టిచెప్పుచున్నాడు - అనేక శిల్పము లొకడుచేయలేదా వాని కార్యరూపానేక శిల్పములునశించినను శిల్పిబ్రతికి యుండలేదా- అట్లానే అన్ని కారణములకు బరమకారణ ముండవలయు ననేకోపనిషద్వాక్య ప్రకారముగా సర్వకారణము బ్రహ్మము సిద్ధించుచున్నాడు—అట్టికారణ మపరిచ్ఛిన్న మైతేనేగాని సర్వకారణ కారణముకాజాలదు—ఒక్కొక్క కార్యమునకు నొక్కొక్క కారణముండవచ్చునంటె సూర్యచంద్ర నక్షత్రములు నిరాధార ముగా నిలువబడితమతమ గతులుతప్పక సంచరించుట , సముద్రములు మేరమీరి రాకుండుట, ఋతుధర్మములు జరుగుట, యీలాటియనేక నియమనములు నియామకునివల్ల తప్పబాలింపబడజాలవు అందువల్లఅన్నిటికి, నియామకుడు, సర్వకర్త, సర్వభర్త, యుండక జరుగదు ఆ యనేదేవుడు, అతడుకార్యము లెట్లునాశమును బొందుచున్నవో అ

ట్లునాశము చెందువాడు కాడు.—

ఏలనంటె అనిత్యమైన యీరూప నామాత్మక ప్రపంచమునాది లేనికాలము నుండి తనశక్తులచేత సృజించుచు మార్పులు జేయుచు నుండుటకు నిత్యమైన సర్వశక్తిగల బ్రహ్మముండకతీరదు - లేదుఈశ్వరులనేకు లున్నారని అనుకుందామంటె యొకరాజ్యములో నిద్దరురాజులుంటెఅదిసరిగా జరుగునా పరస్పర తాత్పర్య భేదముగలుగుచు లోక సౌఖ్యమునకు విరోధము గలుగును కాబట్టి యాస్తికుడు దేవుడొకడే యని చెప్పుచున్నాడు.—

—* { భగవంతుడు ప్రపంచము నెట్లు యెందుకు సృజించెనో యెవరికిని తెలియదనుట. } *—

(౧౮) ఆశంక.

ఆలోచించి ప్రపంచమును సృజించువాడొకడుండవలెనని యీ యుపమానమును జెలిపెనను ఆయనసదాయాలోచించుచుండు నట్లు తెలుపడు- అట్లు తెలిపినా, యదియసందర్భము ఒకప్పుడు ఆలోచించితటాలున ప్రపంచమును జేశెనంటెదానికి గారణమేమిఅని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ప్రపంచమును తటాల్మని చేసినాడని కానిలేకక్రమముగా జేశినాడని కానినాశమగునదియగుచునుండగా తిరిగి సృజ్యములగునవి, సృజించుచున్నాడనిగాని మొదలుకొనఫలానికాలమని నిర్ణయించుట మనుష్యునికిసాధ్యము కాదు—ఎట్లనగానొక వేపచెట్టులో చేదెట్లుపుట్టినదో మనుష్యుడు చెప్పుటకు సాధ్యమాయిదెయిట్లుండగా పైసంగతులకు హేతువులుచెప్పుటసాధ్యముకాదు—అయితే వేపచెట్టులోనుండు చేదుమాత్రము మనకుదెలియువచ్చుచున్నది అట్లెజగత్తు బ్రహ్మనిమిత్త

తమనిమాత్రము తెలియవచ్చుచున్నదేగాని యేవిధముగాజేసినాడు- ఏ లచేసినాడంటె చెప్పుటయసాధ్యము జగత్కర్తయయిన దేవునికిదప్ప గించిత్ జ్ఞులగు నితరులకు తెలియదు-ఎట్లనగా పెట్టినవానికేనిక్షేపము తెలియునన్నసామితె గానితరులకు తెలియదు.—

—*బడాయికోరువలె తనయతిశయమును దేవుడు తెలుపడనుట.*—

(౧౯) ఆశంక.

భగవంతుడుండుట వాస్తవమైతే అతడు తనవిషయమైన సంశయములు జనులకు లేకుండునట్లు తనస్థితినిదెలుపవచ్చును-అట్లుచేయకపోతే సర్వజ్ఞుడు సర్వశక్తుడు కానేరడు. ఏలతెలుపవలశినదంటె,లోకములోజనము, లట్టిసంశయములచేత, పరస్పరముభేదాభిప్రాయము గలవారై మహాయుద్ధములుచేసి మడియుచున్నారు క్రూరకృత్యము లుంజేసి యున్నారుకాబట్టి దేవుడు తనవాస్తవమును దెలుపవలయు లేనియెడలనిదోషిగాడు- మంచివాడని పిలువగూడదు ఇందుచేతదేవుడులేడనియే, చెప్పవలెను అతనికి సర్వజ్ఞత్వాదులు లేవనియైనను, జెప్పవలెను- అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

దేవుడు జగదను మానాదిప్రమాణములచే స్ఫుటముగాదెలియవచ్చుచుండగా దనస్థితి నొక్కబడాయికోరువలె చెప్పకపోవుట ఆయనతప్పుకాదు-అయితె జనులుధర్మాధర్మములయందేమి, ఆచారవ్యవహారములయందేమి, పరస్పరభేదములు గలిగి పోట్లాడిమడిసి పోతారనియు, నిందువల్లవాస్తవమును దెలుపవలశినదంటె ధర్మాధర్మములు నాచారవ్యవహారములు నాయాదేశములో నాయామతస్థులు బుద్ధిమంతులు అప్పటిఅప్పటి విద్యమానమును బట్టియేర్పరచి కొనునవియేగనుకనున్ను, అవిదేవుడేపఱరచినవి కానందువల్లనున్ను, దేవుడు తెలుప

నక్కరలేదు- అయితే,వారువారేర్పరచుకొన్నవిపుణ్యపాపహేతువులె ట్లగునంటె, అనిత్యమైనజగత్తును జేయుటకునిత్యమైన సర్వశక్తిగల భగవంతుడున్నాడని పశుపాలియునికిగూడాతోచుచు నుండగానాస్తికునివంటి బుద్ధిలేనివాడుదేవుడు లేడంటె అదెపాపము-వారువారునెగువ వ్రాశిన ప్రకారముగబుద్ధిమంతు లేర్పరచుకొన్నవే, ధర్మాధర్మము లెట్లగునంటె అట్టిధర్మము లాచరించినందున దేవుడు రక్షించుతాడని యుఅభిసంధియుండుటచేత ఆయనకుదయగలిగి అవిపుణ్యములగుచున్న వి-అట్టి అధర్మము లాచరించినందున దేవుడున్నాడను విశ్వాసము లేక దేవునియందు నిర్లక్ష్యముచేతచేసినట్టులగుచున్నది గనుకవానియందు దేవునికిగోపము వచ్చి వెనుకశిక్షించుచున్నాడు.—అదేపాపకార్యము-అప్పుడే శిక్షించ్చరాదాయనియంటే, అపుడేశిక్షించిన మొదల,లోకములోదోషములేచేయక, అందరుముక్తులగుదురు, అప్పటికె సర్వముక్తిప్రసంగమువచ్చును దేవునిలీలకవకాశము లేకపోవును.—

కాబట్టి దేవుడు పుణ్యపాపఫలములైన, రక్షాశిక్షాదులులోకాంతరమందును జన్మాంతరమందును జేయుచున్నాడు.—

నాస్తికధ్వాంతభాస్కరము,

అను గ్రంథమునందు ప్లీఫార్ ఏతీయసం-

అనుమతమునకు ఖండనము,

సంపూర్ణము.



శ్రీరామ.

# నాస్తికధ్వాంతభాస్కరము.

## పైన్ను చెప్పిన నాస్తికమత గ్రంథమునందలి ముఖ్యాంశములకు ఖండనము.

**ప్రత్యక్షానుమాన ప్రమాణములు యుక్తి ఆస్తిక్యమునకే సాధనమనుట.**

నాస్తికుడు న్యాయశాస్త్ర సమ్మతమై యుక్తి సహితమైనది, తనశాస్త్రమనియు జక్కనివిచారమును, తత్వశాస్త్ర ప్రచారమును, నాస్తిక్యమునకే మార్గదర్శకములగుచున్నవనియు, వ్రాయుచున్నాడు- ఇదే హేతువు- ఆస్తికులమైన మేమున్ను మాఆస్తికమార్గమునకు దారిచూపుచున్నదని చెప్పుచున్నాము - ఏలనంటే యీవిషయమై నాస్తికుడు వ్రాయుయుక్తులకు, మేమువ్రాయు జవాబులవల్ల ఆబాలగోపాలాదులకు ఆస్తిక్యమే సత్యమని తోచగలదు.—

**దేవునివల్ల జేయబడిన ప్రపంచము ప్రాయశః చేతనాచేతన మిశ్రితశిల్పమనుట.**

దైవంసత్యమనునది బహుకాలముగానుండినదియు, పురాతనమునయిన యాస్తికమతము యీక్రింద ఖండింపబడుచున్నది.—

ఆస్తికులు లౌకికశిల్పకార్యములనుజూచి ప్రపంచము ఇట్లెదైవకృతమని దృష్టాంతము చూపుచున్నారు. ఇదిసరికాదు ఏలనంటే - లౌకికశిల్పములు చేయువానిని వానిసాధనములను వానియుపయోగముల

నుమనము చూచుచున్నాము—ఆలాగుప్రపంచము దైవకృతశిల్పమని చె ప్పకూడదు - ఏలనంటె- ఉపకరణములున్ను శిల్పియున్ను ఉపయోగము న్ను కానరాదు- యీవాదములో ఆస్తికనాస్తికులకునుండు తగువు సులభముగాతీరిపోను - అయితేశిల్పమునకు - జగత్తుకు-నెంతమాత్రము సామ్యములేదు.—

శిల్పముచేయువాడిని, సాధనములను, నుపయోగములను,జూ చుచున్నాముగనుక చూడనికర్తను వానిశిల్పములుచూచి యూహిం చుచున్నాము- ఈలాగునప్రపంచ నిర్మాణమునకు ప్రయోజనమును గ ర్తనుబరికరముల నూహించియెట్లుచెప్పనగును - మంచిదిజగత్తులో నొకభాగమునైనా యెవడైనా- యెరుగునా-వస్తువుమాత్రము దృశ్య మగుచున్నదేగాని తదుపయోగాదు, లెవడుచూచినదికాదని నాస్తికు డు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

లౌకికశిల్పము, అనేకాచేతన పదార్థములు మిశ్రమముచేసి చేయవగినది చేయువాడు పరిచ్ఛిన్నుడు - అందుచేత నుపకరణములు కావలశియున్నది - దైవకృతప్రపంచముచేతనాచేతనమిశ్రితమైనది గనుక, యుపకరణములుపనిలేదు ఎందువల్లనంటే మనుష్యుడుచేయు చాచుటగానిచెట్టు వృద్ధిపొందుటగాని యిట్టివిచైతన్య స్వభావముచేత నె కార్యములగుచున్నవి అయితెయిదిస్వభావమని నాస్తికుడుచెప్పు ను- అట్లుకాజాలవు, ఏలనంటేప్రపంచపదార్థము, లనేకోపయోగ ములకు ప్రయోజనకారిగా కనుపించునపుడు అట్టిప్రయోజనములను యోచించిప్రథమములో నిర్మించుటకు- గర్తనుసాపేక్షించుచున్నది అయితే అపరిమితమైనదియునననంతోపయోగముగలిగినదియు, నగు ప్రపంచముచేయుట పరిచ్ఛిన్నుడైన శిల్పిచేతనగునా, యిందువల్ల

అపరిచ్ఛిన్నుడై జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు గలవాడుగానుండవలెను-వాని నిజూచినావా- అని అడుగుచున్నాడు- పరిచ్ఛిన్నము కానివాని నెట్లు చూడనగును- ఇందుకుదృష్టాంతము - మనుష్యుని యందుండు జీవుని-వృక్షాదుల యందుండు చైతన్యమును, నెక్కడ, నేరూపముగానుండేది యెవరయినా చూచియున్నారా - ఇదే యిట్లుండగా జీవాత్మయందు వ్యాప్తముగానుండు పరమాత్మ నెట్లు చూడనగును - మరి యుభగవంతుడు అచేతనముల మేళనమువలన కొన్ని సృష్టిచేసి యున్నాడు——మేఘములు వర్షించుట మొదలయినవియు నీప్రకారము గమనుష్యులును తమశక్తికొలది స్వల్పప్రదేశములో వర్షించునటులకొన్ని శిల్పములు యింగ్లీషువారు చూపించుచున్నారు వారే చెప్పుచున్నారు ఇదెరీతిగ దేవుడు వర్షమును గురిపించుచున్నాడని యిందువల్ల మానవకృతమును పట్టి దైవకృతశిల్పము నూహించుటకు యేవిధమైన విప్రతిపత్తియు లేదు- అయితేలోకములో, నేయేవస్తువునైనా దృష్టాంతము చెప్పునెడ, కొన్నిసాధారణ ధర్మములే, సామ్యములుగానుండునుగాని యావద్ధర్మములు సామ్యములైతే యుపమానోపమేయములకు భేదమేలేకపోను.——

⟶ { మనుష్యాదులలోని చైతన్యమే మనకు దెలియనపుడు తదంతర్యామియై సర్వవ్యాపుడైన దేవుని నెరుంగ గలమాయనుట. } ⟵

(౨) ఆశంక.

జగత్కర్త యదృశ్యుడనునది పిచ్చికూత - కర్తయున్నాడని ఋజువుపరచిన వెనుకయాయన యొక్క యదృశ్యత్వమును మనము ఆయననుజూచునందాక ఒప్పుకోవచ్చును మనచుట్టూ గ్రహనక్షత్రములు- నహోరాత్రవిభాగములు- పెనుగాలి, నెమ్మదిగాలి,. గ్రీష్మవర్ష

ఋతువులు, మొదలగునవికనుపడుచున్నవి - దానికర్తయొకప్పుడు కనుపడడని నాస్తికుడువ్రాయుచున్నాడు.—

ఉత్తరము.

పైనవ్రాసిన హేతువులవలన మనుష్యాదిశరీరములలో చైతన్యమెక్కడ నున్నదిదానిరూపమేమి-ఇదియే, తెలియనప్పుడుదానికి విలక్షణుడై సర్వవ్యాప్తముగానుండువాడు యెట్లుకనుపడును అనివ్రాసియె, యున్నాముగనుక యెప్పటికి, కనుపడేవాడుకాడు, మనచుట్టూగ్రహముల సంచారము- గాలి, నెమ్మది, సముద్రములు మేరమీరకుండుట, ఋతుధర్మములు జరుగుట, యివియెవరియేర్పాటుమీద తప్పకనడుచున్నవో దేవుడున్నాడనుటకునిదే దృష్టాంతము- యేలనంటే-పొగబండియచేతనము గనుకనడిపేకర్తలేకజరుగునా- యిట్లుపైన చెప్పినపదార్థములు అనేకములు అచేతనములుగానుండు నపుడు తన్నియమనాదులు కర్తలేకజరుగునా- అయితే నాస్తికుడు దీనికి నేచర్ అనిచెప్పును అందుకు అర్థము అతనికితెలియదు నేచర్అనేది స్వభావమనిచెప్పును అదిజడమా, జ్ఞానవంతమైనదా- సూర్యచంద్రగ్రహాదులేమి, సముద్రము ఋతువులు మొదలయినవేమి, తమతమనియతగతులు తప్పకసంచరించుటవలన వాటినిజ్ఞానముగల పదార్థములైనవని అయినా, చెప్పవలెను, లేదాజడపదార్థములనియైనా చెప్పవలెను, జ్ఞానవంతములగు పదార్థములని చెప్పితిరా,జ్ఞానవంతులైన మనుష్యాదులను పాలించువాడులేనిదే వారిచర్యలు క్రమముగాజరుగునా అట్లనే సూర్యచంద్రాదులకుపాలించువాడుండవలయును - అవిజడపదార్థములని చెప్పుతారా - ఆసూర్యచంద్రాదులు నియతగతితప్పకుండా సంచరించుటకు ఆయింజన్ నడిపేవానినొకని యొప్పుకోనవలెను-యెట్లనగా పొగయోడ-పొగబండినడిపించువానిని ఒప్పుకొనవలసి

నట్టుదేవుణ్ని ఒప్పవలసియున్నది.—

{ అచేతనశిల్పమువలె చేతనాచేతన మిశ్రిత శిల్పమున్ను కర్తనపేక్షించుచున్నదనుట. }

(3) ఆశంక.

జగన్నిర్మాతను మనముచూడకపోయినమాత్రమే కాకప్రకృతిస్వభావమయిన, నేచర్ యొక్క కర్మమున్నుకూడా మనముచూడలేదు కావున నేచర్ కున్ను శిల్పమునకున్ను సామ్యములేదు-నేచరును శిల్పమనిచెప్పుట పొరపాటు శిల్పవస్తువులు కృతములనుటకు ప్రమాణములున్నవి, నేచరుసంబంధమయిన జగత్తుకృతముకాదు, జగత్తుఅంతయు నెప్పటికినునికిగలది - అందులోనిపదార్థములు పెరుగుచున్నవేకాని, శిల్పకార్యములవలెను చెయ్యబడ్డవికావు- ఎట్లనగా-చొక్కాయకున్ను-మేకకున్నుయేవిధమైన సాదృశ్యముచూపగలదా- మేకచేయబడినదికాదు- అయితె పెరిగినది-చొక్కాయిపెరుగదు-చేయబడినది,జంతువులు కృతములని చెప్పుటసరియైనదికాదు - తెలిసినవారుయిట్లు పొరబాటుగాచెప్పరు - మరియుప్రపంచవస్తువులు వృద్ధిమాత్రము కలిగినవేకాని, చేయబడినవికావని తెలుసుకొందురు- అందువలన చేసినవాడొకడుండవలయుననుట అనావశ్యకము - మతశాస్త్రములు పెక్కులు ప్రపంచము సృజింపబడినదను విషయమునుగూర్చి విశేషముగా చెప్పుచున్నవి-పొరపాటు - యుక్తికిన్యాయమునకువచ్చునది కాదనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

నాస్తికుడు జగనిర్మాతను జూడలేదు ప్రకృతిస్వభావము నే. చరుయొక్క కార్యమునుగూడా మనముచూడలేదుకావున నేచరుకున్నుశిల్పమునకున్ను సామ్యములేదని నేచరును శిల్పమనుటగొప్ప పొర

జాటనివ్రాయుచున్నాడు..

జగన్నిర్మాణతను, నేచరుకార్యమును, గూడాచూడలేదని అంటూ ప్రపంచము నేచర్ స్వభావమని యెట్లుచెప్పుతాడు - శిల్పమువల్ల గలుగు-చాకాౘయవృద్ధికాదు-మేకవృద్ధియగుచున్నది గనుక సామ్యముకాజాలదని చెప్పుచున్నాడు- యీ రెంటికి సామ్యముచెప్పవల్లలేదు, యెందువల్లనంటె- చాకాౘయ-యచేతనపదార్థమిశ్రితమై మనుష్యకృతము- మేకచేతనాచేతన మిశ్రితము- యిందువల్లప్రతిమేకను చేయుటకుగానివాటిని వృద్ధిపొందించుటకుగాని . అప్పుడప్పుడుశిల్పి యావశ్యకములేదుగాని ఆజాతిని అనేకఉపయోగముల కొరకు ప్రథమములో చేతనాచేతన మిశ్రితముచేసి వాట్లబీజములలో ఆలాటివియుత్పన్నమై వృద్ధిపొందుశక్తులను గలుగజేయుటకు జడపదార్థమువల్ల గాజాలదు గనుక సర్వశక్తిగలదేవుడే కర్తయనిచెప్పకతీరదు - మరియుజగత్తు అంతయునెప్పటికి నునికిగలది-అందులోనిపదార్థములు పెరుగుచున్నవేకాని శిల్పకార్యములవలెను నుత్పన్నమైనవి కావుఅనివ్రాయుచున్నాడు యిట్లుబుద్ధిలేనివానితో నేనేమియుత్తరము చెప్పగలను యెందువల్లనంటే శిల్పములున్ను శిల్పిచేతనేకపదార్థములు చేయబడి రూపనామములనుపొందుచున్నవి - యివిఅచేతనములు గనుకవాటిని జేయుటకుపనిముట్లుకావలసియున్నవి- మరియునావెనుకవృద్ధికినిరాజాలవు- ప్రపంచపదార్థములు అనేకపరమాణువులతో దేవునిచేత చేయబడిరూపనామము లేపడుచున్నవి- అయితేఅవిచేతనాచేతన మిశ్రితములుగనుక భూజల పరమాణువులను ఆకర్షించుకొని దేవుని యేర్పాటుప్రకారముగ వృద్ధిపొందుచున్నవి కాబట్టివీటిని చేయుటకుపనిముట్లతోపనిలేదు- యిందువల్ల రెండున్ను కర్తను సాపేక్షించుచునే యున్నవి.——

**చేతన పదార్థములను చేతనాచేతనమిశ్రితపదార్థములను నానావిధోపయోగములకే, దేవుడు సృజించెననుట.**

## (౪) ఆశంక.

నేచరులోనుద్దేశ్యముకనుపడునెడల దానిని మనముపయోగమునున్ను సాధనమునున్నుబట్టియేకనుక్కొనవచ్చును శిల్పములోవస్తువులెందుకుగా జేయబడుచున్నవో అది తెలియకపోతేవాట్లయుద్దేశ్యముకానరాదు- అయితే సర్వశిల్పవస్తువుల విషయమైనేనుచెప్పలేను - కొన్నిశిల్పవస్తువుల యొక్కయుపయోగము మనకుదెలియదుగాని ప్రాయశః అనేకముల యొక్క ప్రయోజనమున్ను ఉపయోగమున్ను మనముచూచియుండకపోతే పైనచెప్పినకొన్ని వస్తువుల జిజ్ఞాసయేకలుగదు - ఆప్రకారముగానే, నేచరుయేల సృజింపబడినదో దానిం జెప్పువాడెక్కడనున్నాడు దానివిస్తారమును దురూహత్వమును నాలోచింపుడు- యిట్లు అమేయమైన మార్పులనుగలదానియొక్క భావమునున్ను ప్రయోజనమునున్నుయెవరు చెప్పగలరు ఒకసూర్యునిబట్టి చూచితే ఒకడుద్దేశించిచేసినదికాదని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

## ఉత్తరము.

బట్టలు నేయుటజూచి శీమలోబొమ్మలు నేయుచున్నవనుట యూహకు రాలేదా అవియెట్లునేయునో యెవరైనా యూహించగలరా. అట్లులేనందుననే, కర్తలేకపోవునా, ఆప్రకారమే, నేచరనుట దేవునిచేతచేయబడినది - ఏలనంటెయొక సూర్యునియొక్కయుపయోగముల నెత్తుకుందాము- సూర్యునివలన రాత్రింబగళ్లుదినములునెలలు సంవత్సరములు వీనినిబట్టి మనుష్యాది జీవజంతువులు గ

భర్భ ధారణజనన మరణాదులు మరియు జ్వరాదులువస్తే ప్రతిదినము గాని రెండుమూడు దినములకుగాని అదేవేళకు వచ్చుటయు భూమిలోనుండునావిరిని కిరణములచేత నాకర్షించిజలముగా పరిణమింపజేసివర్షము కురియుటకును, ఋతుధర్మములు జరుపుటకును - మంచియెండకాలములో వృక్షములుచిగిరించి పుష్పించుటకును, యిదిమొదలయిన యనేకకార్యములకు నుపయోగమగునట్లు సూర్యసృష్టి దేవుడుచేసియున్నాడు- ఫిలోసఫివారు యివిఅన్ని సూర్యునివల్ల కలుగుగుణములని కనిపెట్టియున్నారు- యీలాగుననె చంద్రగ్రహాది నక్షత్రములుభూమిలోనుండు ప్రతివస్తువును ననేకోప యోగములులేక , యొక్కటియు వృధాగానుండలేదు అని బుద్ధిమంతులు కనిపెట్టియున్నారు- కాబట్టిఅనేకోప యోగములకు నొక్కొకవస్తువును సృజించుటకుజ్ఞానేచ్ఛాక్రియా శక్తులులేనివాడు కర్తగానుండక విధిలేదు- యీలాటి హేతువులను నాస్తికుడు యోచించితే తమనాస్తికత దగ్గిరకు రాజాలదు - మరియుసూర్యుని ఉష్ణముకొంతవృధా పోవుచున్నదనియుభూమికి మరియొకయుప గ్రహముంచితే ఎప్పుడువెన్నెలగానుండును - అప్పుడుమిగుల జనసౌఖ్యముగా నుండును యీలాటియనేక హేతువులవల్ల నేచరుస్వభావమేకాని దైవసృష్టికాదంటాడు-యేదో వకటిచెప్పవలెనని దురాగ్రహముచేత వ్రాయుటయేకాని, బుద్ధినివినియోగించిన వాడుకాడు - యేలనంటె, సూర్యునిఉష్ణము కొన్నిదేశములకుహెచ్చు కొన్నిదేశములకు తక్కువగాను వ్యాపించుటచే, శైత్యోష్ణములు తారతమ్యముగాను- మరియురాత్రిపగలు కాలతారతమ్యముగాను మరియుసూర్య దర్శనమేలేని, యుత్తరపుదిక్కున సర్వదామెలయుట గలుగజేసినాడు- అక్కడక్కడి జనజంతువృక్షాదులకుఅది అనుకూలముగానే యున్నది, మరియుజంద్రుని వృద్ధిక్షయ

ములవలన గొన్నాళ్లువెన్నెల, కొన్నాళ్లుతరగతి ప్రకారముగ చీకటి యును, గలుగజేసి చంద్రుని శీతమును తగుమాత్రము జనజంతు వృక్షాదులకు అక్కడక్కడి స్థితినిబట్టి గలుగజేయుచుండగా రెండుచంద్రులుగానుంటే, యెంతయుపద్రవము గలుగునోమీరే యోచించుడు- ఇందుకు నొకదృష్టాంతము - ఒకదేశప్రజలు మరియొకదేశపు శీతోష్ణాదులు సహించలేక యుండుటచూచే యున్నాము గనుక తత్తద్దేశీయులకు నెంతెంతకావలెనో, అంతంతశీతోష్ణముల, దేవుడుకలుగజేయుచున్నాడు- ఇందువల్ల ఆయాదేశప్రజనుల, దేహబలములు రూపభేదములు వర్ణభేదములు వేరువేరుగా నుంటున్నవి- అందరిని సమానబలులుగా, జేయకపోవుట, దేవుని పక్షపాత మనుకొందురు? దేవుడుతనసృష్టిలో వివిధవిలక్షణతను గలుగజేయుటయె, ఆయనసామర్థ్యసూచకము - ఇందుకునిదర్శనము - మంచువిశేషముగా, పేరుకొనురాజ్యములో, చమురుకూడా మండదు - ఘనీభవించుచున్నది- అచ్చట నొకవిధమైన కాష్ఠములను నిర్మించినాడు అవిచమురుపోసినవత్తివలె మండుచున్నవి- మరియును- మంచువిశేషముగా పేరెడుకొన్ని దేశములలో చర్మసంబంధమైన బూడ్సులుగాని చెప్పులుగాని యుపయోగపరుచుకొంటె బిరుసెక్కి- తునుకలైపోతవి - ఆచోటదేవు డొకవిధమైన గడ్డిపెట్టినాడు - ఆగడ్డితోజేచిన చెప్పులేర్పరచుకొంటే, అవి యుపయోగించుచున్నవి- ఆదేశములో నొకమృగములున్నవి.- వాటికిగిట్టలు పొడుగుగాను గుద్దలికన్నా బలముగాను దేవుడు సృజించినాడు- ఆగిట్టలతోపైన ఘనీభవించిన మంచుగడ్డలను బగలగొట్టి క్రిందయుండినగడ్డిని భక్షించుచున్నవి- ఆగడ్డిమంచువల్లనశించిపోకుండా తాళియుండునదిగా, దేవుడు సృజించినాడు- ఎసిక్విలోయనువారికి మంచుమీద ధారాళముగా నడిచేశకిని గలుగజేసినా

డు. విశేషమంచు దేశములో ఆచ్ఛాదనకు శునకాదులకువిశేషవెంట్రు కలు గలుగజేసినాడు-ఇందువల్ల తనవిచిత్రశక్తి ప్రకాశమగు ప్రపంచములోననేక వైచిత్ర్యములను సృజించినాడు- మరియు మత్స్యములను భక్షించులాగున పక్షులను సృష్టిచేసివానికిలోతగునీటిలోనిలుచుకొనుటకు,పొడుగుకాళ్లను-లోపలనుండుచేపలనుభక్షించుటకు పొడుగుముక్కులనుయిచ్చియున్నాడు-మరికొన్నిజలపక్షులకునీటిలోమునిగితే రెక్కతడిసినానీరంటనిగుణమునిచ్చినాడు - అవియీదుటకుజాలపాదములను యేర్పరచినాడు నీటిలోమునిగిచేపలనుదినుచున్నవి-చేపలుమొదలయిన వాటికినీటిలోనూపిరియాడకుండనుంటే, బ్రతికేలాగున నేర్పరచినాడు- కడమజంతువులకునూపిరియాడకపోతేచచ్చేలాగున నేర్పరచినాడు- కొన్నిమండూకకచ్ఛపాదులకు నుభయవిధశక్తులిచ్చినాడు అనేకజంతువులు నెండ్రకాయలు మొదలయినవి పక్కకునడిచేలాగున చేసినాడు-రొయ్యను వెనుకకునడుచులాగున జేసినాడు- నానాజంతువులునిలుచుకొని అడ్డముగానుంటే బ్రతికేలాగున నేర్పరచినాడు- గబ్బిడాయ చీకురాయ మొదలైనవాట్లకు తలక్రిందుగనుంటే బ్రతుకునట్లుంచినాడు - కొన్నిచిన్నచిలుకలు జాగ్రతలోసమముగాను నిద్రలోతలక్రిందుగానుండే లాగున జేసినాడు మాంసమెయాహారముగాగలమృగపక్షులకు పండ్లయందు గోళ్లయందుబలిమియుతీక్ష్ణతయు గలుగజేసియున్నాడు,ఆరెలుగల కుక్కుటాధులకు కాళ్లతోతన్నులాడునట్లుచేసినాడు,యీలాగున దేవుడు తనవివిధశక్తినిగనుపరచుటకు నానావిధనిర్మాణము చేసియున్నాడు-యిట్టివిద్రాయబోతే,భూమంతకాకితము,సముద్రమంతశిరాయున్ను,అయినాచాలదు-కాబట్టి యుపయోగములు నుద్దేశ్యములు తెలియవచ్చుచుండగా,గర్తలేనిది, యెట్లుకలుగును-క్షామడాంబరములు అతివృష్టియనావృష్టులు- మారి- పోలేరి- యనునిట్టి-యుపద్రవములు నీలాటియనేకజనోప

ద్రవములును దేవుడు గలుగజేయుట మంచిమెట్లగుననని అడుగుచున్నా
డు- దీనికంటెమనుష్యాదిజంతువులకు జావునెందుకు నిర్మించినాడని
యడుగవచ్చును- యిందువల్లదేవుని రాజ్యములోనతడు చేసియుండు
నేర్పాటు, లీశత్తయినా, తెలిసికొన్నవారుకారనియు, నిట్టివారికినే
నుజవాబు చెప్పటకుబూనుకొన్నందుకునాకు కలిగినబుద్ధిహీనతయు,నే
పడుచున్నదనియునుదలచెద - నెట్లనగానొకరాజు తనరాజ్యములో
వచ్చువరుంబడికి తగినసేనయుఖచర్చులునుంచుకొంటున్నాడు - తనర
యితులనొద్ద నధికముగా తీసుకొనరాదాయంటె, వాలజీవనోపా
యమునకుబోను తక్కినది తీసుకొనుచున్నాడు-. ఇదిఅందరికితెల్లమేగ
దా, ఇట్లుండునపుడు దేవునిరాజ్యములోనన్నాదులకు నెంతయుత్పత్తి
యేపఱరచియున్నాడో,అంతకుతగినమనుష్యాదుల నుంచుకొనుచున్నా
డుఅధికముగా వృద్ధియగుచుండు నీమనుష్యాలను, సరిచేయుటకైక్షామ
డాంబరములను మారి - పోలేరిఇత్యాదివ్యాధులను గలుగజేసిభూమి
యందు ఫలోత్పత్తికి సరిగా సరిచేయుచున్నాడు.——

ఇందుకు దృష్టాంతము పూర్వకాలమునందు రాజులు పరస్ప
రయుద్ధములు విశేషముగా చేయుటవలన ననేకజనులు మడియుచూ
వచ్చిరి, యీవలయుద్ధాదులు తక్కువగా నేర్పడినందున, కలరా
మొదలయిన యుపద్రవములు నూతనముగానేపఱరచి యీరీతిగామ
నుష్యులను సరిచేయుచున్నాడు-అయితెయివియును నిర్నిమిత్తముగా
హింస గలిగించుటయేకదా, అంటెసంఘాతజనము యొక్కఅదృష్ట
మును బట్టియే, కలుగచేయుచున్నాడు-మరణమునైనాయేల సృజించ
వలెనంటె పుట్టినవారంతా చావకయుండినయెడల ప్రపంచమేపట్టక
కాని, గోతాములో రాళ్లుకూరినట్టుగాని మనుష్యులకుసుఖమే, లేక
పోవును, యిందునిమిత్తముగానే, భాగ్యదారిద్ర్యములను మనుష్యుల

కుగలుగజేయుచున్నాడు- ఎట్లనగా-దరిద్రుడులేకపోతే భాగ్యవంతునికిసేవాదిక సుఖమెట్లుగలుగును - భాగ్యవంతుడులేకపోతె, బీదవానికి నన్నవస్త్రాది సుఖమెట్లుగలుగును, ప్రతిసంగతిలో కీడుమేలులనునవిపరస్పరాశ్రయా శ్రయభావముగాగలుగ జేసియున్నాడు. —

**మనుష్యాది సమస్తజంతువులు కీడుమేళ్లనుభవించుటకై భూమి సృజింపబడినదనుట.**

(౫) ఆశంక.

భూమినిమనుష్యుల కొరకు దేవుడు సృజించినాడనగూడదు-మనుష్యునికి భూమియందేయనేకదుఃఖ ప్రాప్తములగుచున్నవిగనుక మనుష్యునిమేలుకొరకు భూమినిసృజించినట్లు చెప్పగూడదని నాస్తికుడు చెప్పుచున్నాడు. —

ఉత్తరము.

ఆస్తికుడు మనుష్యులకొరకే భూమిని సృజించినాడని చెపను- అయితేఈశ్వర సృష్టిలో జేరినజంతువులలో జ్ఞానశక్తులుమనుష్యునికి నధికముగానన్నవి- మరియునేవేవి యుత్పన్నమగుచున్నవో వానికినాశమున్ను గలుగజేసియున్నాడు - ఏలనంటె అవ్యవస్థాప్రసంగము రాకుండుటకు- నిట్లుసిద్ధముగా నుత్పత్తినాశములు భూమియందుగలిగియుండునపుడు మనుష్యాది జీవజంతువుల యొక్క మేలు కొరకయ్యే భూమిని సృజించినాడనియెవడు అనుకొనును. —

—✻ సేచరుకు ఆదికారణము,నంత్యమున్నుగలదనుట.✻—

(౬) ఆశంక.

మఱియు నెప్పుడు తుదలేకుండనుండు నట్టిదియు, తప్పకజరుగునట్టిదియునగు సేచరులోనిసంగతులకు నాదికారణముగాని, యంత్య ప్రయోజనముగాని యున్నదనిచెప్పుట బుద్ధియుక్తముకాదు- మత

స్థులు ప్రత్యక్షమునకును ననుభవమునకును విరుద్ధముగా నమ్మికమీద నిలుచుచున్నారని, నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ప్రపంచము తుదలేనిదని తనకునెట్లు దెలిసెనో, యోచనకు రా లేదు-ప్రపంచపదార్థములు ఏవిదృశ్యములగుచున్నవో వానికి, నాశము చూచుచున్నాము- మరియుతప్పక జరుగునట్టిదని వ్రాయుచున్నాడు అనేకసంగతులు బుద్ధిమంతులు మాఱ్పులుచేయుచుండలేదా, మరియు నేచర్ లోనిసంగతులకు నాదికారణములేదనుచున్నాడు తుదకువాడై నాపరమాణువులు మొదటికారణములని చెప్పకవిధిలేదు.—

అట్లుండగా, నాదికారణములేదని, యెట్లుచెప్పనగును- అయితె అవిజడములుగనుక తనంతట,అవిమిశ్రితమై వస్త్వంతరముకాజాలవు - అనేకోపయోగములకొఱకు, ననేకస్వభావములను గలుగజేసి, జ్ఞానేచ్ఛాక్రియాశక్తులుగల భగవంతుడు, ప్రపంచమును గలుగజేయక, తనంతటకాజాలదని యెగువ ననేకస్థలంబుల వ్రాసియేయున్నాము - అంత్యమున్నదని చెప్పుటబుద్ధి యుక్తముకాదని వ్రాయుచున్నాడే, పైయుక్తులవలన, నాదికారణమేర్పడినపుడు- అట్లే,యంత్యమేల యూహింపగూడదు - గనుకయాస్తికమతస్థులు ప్రత్యక్షానుమాన ప్రమాణములను బట్టియు, యుక్తిని బట్టియు దృఢమైన నమ్మికమీదనే, నిలుచుచున్నారు.—

జీవులకుదత్తదదృష్టానుసారముగ
సుఖదుఃఖాదులను రూపాదులను
దేవుడేయిచ్చుచున్నాడనుట.

(౭). ఆశంక.

తుపానును అగ్నిపర్వతములను, జనులకు నాశనము గలుగవలె

నను దురుద్దేశ్యముతో దేవుడేచేసి నాడాయని నాస్తికుడు చెప్పుచున్నాడు.

ఉత్తరము.

ప్రపంచములో, నేవస్తువును హేతువు, నుపయోగము లేకయే, దేవుడు, చేయడనియు, జనసంఘాతా దృష్టములవలన, మంచిచెడ్డలు, గలుగజేయు చున్నాడనియు నెగువవ్రాసియే యున్నాము.

ఇందుకుదృష్టాంతము - నాస్తికుడు వ్రాసినమాటయే, పిచ్చివాడుపుట్టుటకు గారణమేమి, తలలేకుండ, గుక్కపుట్టుటకు గారణమేమి, ఇవియంతయు నేచర్ స్వభావమని, నాస్తికుడువ్రాసెను- దీనికి నేచర్ యొక్క కారణ కార్య హేతువులనువాడు, కనిపెట్టినాడా, మాకుజూపుచున్నాడా? మంచిది, యనేక బుద్ధిమంతులగు గొప్పడాక్టర్లు వ్రాసిన, ప్రసవవిషయమైన గ్రంధములలో స్త్రీపురుష సంయోగము మొదలుగ, బ్రసవ పర్యంతము శిశువుయొక్క ప్రతిదినస్థితిని, వ్రాసిరేగాని, స్త్రీశిశువుగా బురుష శిశువుగా నేర్పడుటకు గారణము తెలియదనివ్రాసిరి, యిదంతయు నేచర్ స్వభావమేయగు నెడలనిదిమాత్రమేల తెలియకపోయెను ఇందువలన దలి దండ్రులయొక్కయు, నాశిశువుయొక్కయు, నదృష్టమే కారణమని చెప్పవలయునేతప్ప, వేరేచెప్పుటకువల్లలేదు- ఇట్లేపిచ్చివాడు మొదలగువారు పుట్టుటకు నదృష్టమే కారణమని చెప్పవలయును.—

అదృష్టాధీనముగా దేవుడే, కలుగజేయుచున్నాడు- ఈసంగతి నాస్తికుని యూహకురాక పోవుటవాని దౌర్భాగ్యమో, లేకవానిపిచ్చి యాక్షేపములకు, మేముసమ్మతులు వ్రాయవలసినందుకు నేర్పడు మాదౌర్భాగ్యమో నాకుదెలియలేదు.—

అన్నిటికి హేతువులేక నేసుఖదుః
ఖాదులు దేవుడుకల్పింపడనుట.

(ర) ఆశంక.

మఱియు ననేకవస్తువులు ప్రపంచములో సంకటముచే యిచ్చు చున్నవి- అతిశయమయిన యుష్ణముశైత్యము- పురుగులు కుట్టుటయు హింసామృగములు ననేకములగు- వ్యాధులు మొదలగునవి మరియు బ్రసవమునకు సమానమయిన కష్టములేదు- యీలాటివి యీయావత్తువా ట్లవల్లనొక మేలునులేదు యీలాటివి ఆలోచనచేసి చేయబడినవేనా- మరియుమనుష్యుని రక్తముమీదను - కండమీదను జీవించునట్టి పురుగులుకొన్నియతి హింసాకరములై యున్నవి- అవిమనుష్యునియందె, వసించుచున్నవిగదా, దీనినిజూడగా మనుష్యులువీనికివాసస్థానము గాను ఆహారముగాను సృజింపబడినట్లు కనుపడెదరు- భూమిసృష్టికి మనుష్యుడుహేతువా- లేదా, వానిమీద జీవించుపురుగులా, నాకుజూడనీ పురుగులే, ముఖ్యహేతువు లగుచున్నవి- ఈయుద్దేశ్యముతోనే, భూమిసృజించినట్లగును కాబట్టిప్రపంచసృష్టినిజూడగానొకయుద్దేశ్యము ప్రయోజనముకనుపడదు- అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

అతిశీతలము - అత్యుష్ణము ఏదైనాసరె దుఃఖములుకలుగజే యనిదిసుఖమునకు హేతువు కాజాలదు - మఱియు, కుట్టేపురుగులు హింసించేమృగములు- ననేకములగు వ్యాధులు వీట్లవల్ల, నేప్రయోజన మున్నూలేదని అనుచున్నాడు—పూర్వజన్మమును ఒప్పుకొనని వాడు- కాబట్టిఅట్లు చెప్పుచున్నాడు గాని పాపఫలాను భవమునకై. దేవుడీలాటివి సృజించినాడు.—

ప్రసవవేదనకు మించినవేదన లేదని చెప్పుచున్నాడు- గొప్పడా

కట్టర్లను నీప్రసవశాస్త్రములు వ్రాసినదానిలో గర్భప్రారంభము మొదలువమనములు నన్నద్వేషములు నీలాటివి ప్రసవవేదన పర్యంతమునుండుటమాత్ర శిశువులకు ఆరోగ్యహేతువులని వ్రాసినదిచూడలేదా-ఇందుకుదృష్టాంతము- చీమిడిసిబయిట త్రోయగలందులకు, నెంతకష్టమైన తుమ్మును దేవుడుసృజించి వాడు ఆచీమిడిబయిటికి వచ్చుటవల్లవానికినారోగ్యమేకదా- అజీర్ణముచేసినవానికి కడుపువడవేయుటయు మలనివృత్తికేకదా- దగ్గునుకలుగజేయుట కంఠములోనుండు గల్లబయిటికివచ్చుటకేకదా- కురుపునొప్పిచేయుట చీముబయిటికివచ్చుటకేకదా-యిట్లే ప్రసవవేదనకలుగజేయుట శిశువుబయిటికివచ్చుటకేకదా- అయితే ప్రసవవేదనలేకనే, ప్రసవమగునట్లు, దేవుడేర్పరచరాదా, యనియందురు యింతతోపుడుచేత గర్భద్వారము విపులమగునంతబిగివియుండబట్టె, శిశువు,మావి,తొమ్మిదిమాసములయొక్కరజస్సు,గర్భములోనిల్చి యుండుటకు, గారణమవును - అవియన్నినిల్చియుండుటచేతనే,శిశువునకు, కవచరూపమై, డక్కాతగులకుండానున్నా వృద్ధికరముగానునుండుటకు హేతువగుచున్నది- కాబట్టి యీపరిసవశ్రమకు సరియైనకారణములు, శాస్త్రములచేతను , అనుభవములచేతను, గనుపించుచున్నవి- మరియుతల్లియెంత శ్రమపడిబిడ్డను కనుచున్నదో, అంతబిడ్డయందు ప్రీతిగలుగుటకును, అందువలనబిడ్డ మలమూత్రాదులకు సహించిబిడ్డను పోషించుటకు హేతువగుచున్నది.—

మరియును మనుష్యునియందు కలుగుచుండు పురుగులకొరకు భూమిని సృజించినాడా, యనివ్రాయుచున్నాడు అట్లుకాదు-సమస్తమైన జీవకోట్లకు పుణ్యాపాపజన్య సుఖదుఃఖానుభవార్థమై యీప్రపంచము సృజించినాడు మరియును- మనుస్మృతిలో- (జీవోజీవస్య జీవనం) అనిచెప్పియున్న ప్రకారము ఒకజీవశరీరము మరియొక జీవశరీ

రవృద్ధికి నాహారముగా సృజించుటచే మనుష్యశరీరమందుండు జీవజంతువులకు నాహారముగాను - ఆధారముగానునుంటున్నది-మరియు పొశ్టేలి తలలోగొన్ని పురుగులు నియతముగానుంటున్నవి- ఆలాటివికొన్నివాట్లకు నారోగ్యహేతువులుగానేయుంటున్నవి- యీలాటి హేతువులు బుద్ధిమంతులు చూడగాప్రపంచ సృష్టిలో చేరినపరిసంగతియు, వ్యక్తముగానున్నట్టుకనుపడదు యిందువల్లసర్వజ్ఞుడై సర్వశక్తిమంతుడైన వానిచే నివియన్నియు నిర్మింపబడవలయును.—

—{ జగదుత్పత్తినాశముల ప్రవాహము నిత్యమనియు నట్లు సంకల్పించుదేవుడు తనవిశేషణ విశేష్యభావములచేత జగత్తుకు,నభిన్ననిమిత్తోపాదాన కారణమనియుననుట, }—

(౯) ఆశంక.

ఇకను కారణ కార్యస్వరూపమును ఆలోచింతము- కార్యకారణవాదము యేకదేశములోనంగీకార్యమయినను దీనివల్ల సర్వకారణమొకటి యున్నదనునది యేర్పడదు-ఈప్రపంచస్థితియెప్పటికినుండునది నేనట్లుచెప్పుటకు గారణమిచ్చుట జెప్పబడదు - అన్యత్రచూచుకోవలయును మనమనేకములగు-కారణముల యొక్కయు గార్యముల యొక్కయునదంపునున్నామనుటకు అందరునొప్పుకోతగినది- మరియు మనము అనంతమయిన యవకాశముయొక్కయు గాలముయొక్కయునదుమనున్నాము యీరెంటియొక్క అనంతత్వమునుఅందరు నొప్పుకొనియున్నారు- యీనిత్యకాలముయొక్క కడపటి యంశములుగాని మధ్యభాగములుగాని యాదిభాగములుగాని కనిపెట్టి యాస్తికుడు చూపగలడా, లేదు - ఆలాగే ఆకాశములోను నెంతదూరమునే ప్రక్కగాబోయినను, నింకనవకాశ మున్నదేకాని, వేరుకాదు- కావునఆద్యంతాదిశూన్యము, ఎట్లుప్రథమకాల మనునదియసంబద్ధమో,యాలాగే

ప్రథమకారణ మన్నదియు, నసంగతము - ఇందువల్లప్రథమకారణ మొకటియుండెననుట , యసంగతము- యిదియాస్తికుల యొక్కకల్పనతమచుట్టు దృశ్యమానములగు కార్యకారణముల పరంపరలనుచూచి, ప్రపంచమునకు నొకపెద్దకారణ ముండవలెనని చెప్పుచున్నారు యిది యాస్తికుడు తృప్తికరముగా దలచుచున్నాడు- చక్కగానాలోచించి చూచినయెడల నీకల్పనశుద్ధముగా జాలనిదియని తెలియవచ్చును- అని నాస్తికుడు చెప్పుచున్నాడు.——

ఉత్తరము.

ఆదికారణ మనునది ఘటమునకు మృత్తువలెపరిణామ్యుపాదానకారణమా, కులాలునివలె, నిమిత్తకారణమా, అతడు వ్రాయలేదు- యెటులైనాసరే, ఆదికారణ మనునది యేర్పడదు అని చెప్పుచున్నాడు. ఆస్తికసిద్ధాంతము తెలియనిమాట - యేలననగా- మేముచెప్పేది, అది అంతమనునది ప్రతివస్తువుయొక్క రూపనామోత్పత్తి నాశముల బట్టి యేర్పడియుండునది - యిట్లేప్రతిసారి ప్రతిబ్రహ్మాండ సృష్టినాశముల నుబట్టియేర్పడేదేగాని ఆదిసృష్టిఅనేది మేముచెప్పేదిలేదు- ఇకమేము చెప్పేఆదికారణమనుదానికి, తాత్పర్యమేమనగా, జ్ఞానేచ్ఛాక్రియాశక్తులుగలవాడు బ్రహ్మమనియు పలుమారుతన యిచ్ఛాశక్తిచేత సంకల్పించితన జ్ఞానశక్తిచేత నుపయోగములను యోచనచేసి, క్రియాశక్తిచేతఆలాగు తనయిచ్ఛాను సారముగా చేయుచున్నాడు అనిభావము - అయితేయే పదార్థములచేత జేయుచున్నాడని యడిగితేఆ బ్రహ్మముచిదచి ద్విశిష్టుడు గనుక, తనకువిశేషములైన చిదచితులచేతప్రపంచ నిర్మాణమును చేయుచున్నాడు.——

అనగాతనకు విశేషణములైన చిదచిత్తులను వికసింపచేసిమిశ్రముచేసి, రూపనామములను కల్పించివాటిలోకొన్ని శక్తులుంచుటయే

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట సంఖ్య, | పఙ్త్కి సంఖ్య, | తప్పులు. | ఒప్పులు. | పుట సంఖ్య, | పఙ్త్కి సంఖ్య, | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|---|---|---|---|
| ౫౮ | ౨౨ | నప్పు | దప్పు | ,, | ౨౦ | సప్తభంగ | సప్తభంగీ |
| ,, | ౨౩ | క్తులువ్రా | క్తులునాస్తి | ౭౬ | ౩ | సప్తభంగ | సప్తభంగీ |
| | | యు | కుడు వ్రా | ,, | ౨౦ | సప్తభంగ | సప్తభంగీ |
| | | | యు | ౭౭ | ౪ | సప్తభంగ | సప్తభంగీ |
| ౫౯ | ౨౨ | మెటల్ | మెటర్ | ,, | ౫ | సప్తభంగ | సప్తభంగీ |
| ,, | ౨౩ | పరిణామం | పరిణామ | ౭౮ | ౧౦ | సప్తభంగ | సప్తభంగీ |
| ౬౧ | ౧ | నప్పుడు | నప్పుడిక్క | ౭౯ | ౨ | మోక్ష ము | మోక్షము |
| | | యీ | డ సేయీ | | | నగలుగు | గలుగు |
| ,, | ౯ | వేకమును | వేకమునకు | ,, | ౭ | ఇందుదల్ల | ఇందువల్ల |
| ౬౨ | ౧ | తంత్రములు | తత్వములు | ,, | ౧౪ | పైకే | పైకె |
| ,, | ౧౫ | రీరములో | రీరములో | ,, | ౨౪ | సంతఃకర | సంతఃకరణ |
| ౬౪ | ౩ | హెచ్చుట | హెచ్చున | | | ణమును | మునకు |
| ,, | ౪ | రాహింకులు | రోహింతులు | ౮౨ | ౧౪ | నిర్విరేష | నిర్విశేష |
| ,, | ౧౧ | ములకును | ములగను | ,, | ౨౨ | జీవంబు | జీవత్వంబు |
| ౬౯ | ౧౫ | గుష్మము | గుఙ్మము | ౮౩ | ౧౩ | బ్రహ్మమున | బ్రహ్మమే |
| ౭౧ | ౧౭ | నాతాత | వాతాత | | | కే | |
| ౭౪ | ౫ | యత్నము | అయత్నము | ౮౮ | ౧౧ | అపూర్వ్వ | మంచి య |
| ౭౫ | ౧౬ | గోత్రక | గోత్రిక | | | మును | పూర్వమును |



సృష్టి- వీట్లకురూపనామములను నివర్తింపచేసి తనస్వరూపములో విశేషణములులీనముచేయుటయే జగత్ప్రళయము-తిరిగి సృజించుటయే, జగదుత్పత్తి- ఈయుత్పత్తి నాశముల యొక్క ప్రవాహమునిత్యము, ఇది,ఆస్తికులయొక్క సిద్ధాంతము,ఇందువల్ల ఆదిసృష్టి యనునదియే లేదు- అయితే సంకల్పించువాడు తద్రూపములుగ, జేతనాచేతన మిశ్రితముగాబరిణమించువాడు - తనవిశేష్యవిశేషణ భావములచేత, నభిన్ననిమిత్తోపాదాన కారణముగా, నొకడేయగుచున్నాడు, కాబట్టిఆయనకుమరియొక కారణముండవలసిన యావశ్యకములేదు- బ్రహ్మమేసర్వకారణకారణము.——

నేచరుజడమైతే ప్రపంచమునకు, గారణముగాజాలదు జ్ఞానాదిసర్వశక్తులుగలదైతే కాగలదుఇదియేబ్రహ్మమనుట.

(౧౦) ఆశంక.

నేచరువల్ల యీ-ప్రపంచము కలిగినదని చెప్పుచున్నాడు- ఆస్తికుడుదాని స్వభావము జడము అందువల్ల నానావిధోపయోగములు యోచించుటదానికి సాధ్యముకాదు - మరియు ప్రపంచములో బుట్టినపదార్థములలో ననేకములు జ్ఞానవంతములుగానున్నవి ఆజడమువల్లజ్ఞాన మెట్లుకలుగును- అంధముగానుండు ప్రకృతి కదలజాలదనియు- నానావిధచిత్ర రూపముల, నెత్తజాలనిదియనియు, జెప్పుచు మరియు ప్రపంచము తనంతట పుట్టదనియు-జగత్తులో జ్ఞానము ప్రాణముమొదలైనవి - చేతనకార్యము లున్నవనియు, నివి-కేవలము ప్రకృతివల్లజనింపవు , జ్ఞానేచ్ఛాక్రియా శక్తులుగల వస్తువుచేత జనింపవలయుననియు, ఆస్తికుడు చెప్పుచున్నాడు - ఈమాటలు అర్థహీనములుపూరికే నమ్మవలసినదేగాని యుక్తికిరానివి- ఏలనంటేవారు చెప్పు

ప్రకారముగ ప్రకృతి, జడమయినదియు నంధమైనదియు గాదు, బాగుగా నాలోచించిన యెడల ప్రకృతి యాలోచింపజాలనిదని గాని స్పర్శజ్ఞానము మొదలగునవి లేనిది యని గాని చెప్పరు- నేచరులో సూర్యచంద్రుల ప్రకాశము- గ్రహముల చారములు- వాయుగతులు- సముద్రములో బ్రవాహములు, మొదలగునవి, ఋతువుల మార్పులు శాకముల యుత్పత్తులు జీవజంతువుల ప్రాణవృత్తులు- మొదలగునవి ప్రకృతియందుండు శక్తులు ఇవి తెలిసీ అది జడమనియు ననగా ప్రాణహీనము జ్ఞానహీనమనియు చెప్పుట చెప్పువారి జ్ఞానహీనమేను- యెడతెగక రూపములను మార్చుచు విచిత్రశక్తులను గలుగజేయునట్టి వస్తువు జడమనవచ్చునా, నీవు జీవించు రీతికంటె భేదముగా- జీవముకలిగి యుండుట చేత దానికి ప్రాణము లేదని యెట్లు చెప్పుచున్నావు - నీవు నీకన్నులతో జూచునట్లు అది చూడదు గనుక అది అంధమని యెట్లు చెప్పుచున్నావు- మరి, యుగాంతములో అయమునాకర్షించు శక్తిమనము చూచుచున్నాము- భూమికిన్ని దానిపైభాగములోని వస్తువులకునుండు ఆకర్షణశక్తి మనకు దెలిసియున్నది- యిట్టిశక్తుల నేక వస్తువులలో నున్నవి- దీనిం బ్రాణమనుటకు సందేహమేమి- ఈవస్తువులకంటె గొప్పవియగువాని లోనుండు శక్తిని జ్ఞానమనుచున్నాము- మనుజునకు ప్రాణమన్నది యెంతయావశ్యకమో ఆలాగే కాంతమునకు, నాకర్షణశక్తి యావశ్యకము - మనుష్యునకు ప్రాణముగలుగుటకు గాను ప్రాణము గలిగియుండు పురుషుడొకడు, కావలసినదని చెప్పు పక్షమున, కాంతము సృజించుటకు గాను, నట్టియాకర్షణ శక్తిగలవాడొకడుండవలసినది కూడా ఆవశ్యకమే నాయనియంటే , ఆస్తికులు యీవిధముగా చెప్పుచున్నారు- యేదిగాని తనయందు లేనిశక్తులను ఇవ్వచాలదు గనుక దేవుడు సర్వశక్తిగలవాడని చెప్పుచున్నారు ఈపక్షములో వింతైన దేవుడు

గానుండవలయు- నెట్లనగా బ్రకృతియందు కనుపడు గుణములన్నియు దేవునియందు, నుండితీరవలయు- నవియేవనగా- గురుత్వము - రూపము- వర్ణము-రుచి- వాసన విస్మృతి- ఘనత్వము- ద్రవత్వము-విరూపము- ఔష్ణ్యము మొదలగునవికాక- పరస్పరవిరుద్ధములగునవియు- కలిగియుండవలయు- నెట్లనగా- చలనము-నిశ్చలత్వము-ప్రాణత్వము- జడత్వము- అంధత్వము- చక్షుష్మంతత్వము- తెలివి- మౌఢ్యము-మంచి-చెడు-అందము - కురూపము మొదలయినయీగుణములు ప్రకృతికి సహజముగానైనా యుండవలయు- లేదావానినికలిగియుండు నొకని వల్ల నివ్వబడినవిగానైనా యుండవలయునని నాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

ఈయన్నిశక్తులు దేవునియందున్నవని, ఆస్తికుడు చెప్పురీతిగ నాస్తికుడు జ్ఞానాది సర్వశక్తులు నేచరుయందున్నవని చెప్పుచున్నాడు- నేచరు జడమని నాస్తికుడు చెప్పినపుడే అదిజగత్కర్తకాజాలదనిమాయాక్షేపమేగాని- జ్ఞానాది సర్వశక్తులు గలవనిచెప్పుపక్షములో మాయాక్షేపమేలేదు- మాయొక్క సిద్ధాంతములోకేదిగి, యొక నేచరనుమాటమాత్రము వేరుగచెప్పుచున్నాడు- ఇదియేమేము బ్రహ్మమనిచెప్పుచున్నాము- అయితెఅంధత్వముమౌఢ్యము- ఈలాటిచెడుగుణములు ఆయనయందున్నవాయనిఅడుగుదురు-ఆయనయందుస్వరూపతఃలేవు- సర్వశక్తులుగలవుగనుక యొకదానికొకటిమేళనము చేయుటలోనవి యేర్పడుచున్నవి- ఎట్లనగా- ఘటశరావాదులు మృత్తుయందున్నవా, మృజ్జలములు మిశ్రమముచేసికులాలుడు చేయురూపనామములు—తద్వత్తుగా, తనయొక్క ప్రపంచోపాదాన కారణములైన శక్తులమేళనముచేత, ఆలాగుపరిణమింప జేయుచున్నాడు—ఇందువ

ల్లసాక్షాత్తుగా, నతనియందు ఈగుణములులేవు.—

—{పరిపూర్ణమగు, నాకాశమందు, శబ్దమువాయు వువలె, పరిపూర్ణ బ్రహ్మమందు జగదుపాదాన కారణ సమస్తశక్తులున్నవనుట.}—

(౧౧)ఆశంక.

ఆస్తికులుమరియును దేవుడు పరిపూర్ణుడనియు సర్వత్రియు న్నాడనియు జెప్పెదరు-ఆపక్షములోనతడు తుదిలేనియొకపదార్థము గానుండవలయు- ప్రతిపదార్థమునకు దత్ స్థితికొరకు- స్థలముఆవ శ్యకము స్థలాపేక్షలేని పదార్థమొకటియులేదు - ప్రతివస్తువునకు- తానుపట్టదగినంత అవకాశము తనకావశ్యకముకాబట్టి - తుదిలేనిప దార్థమునకు దుదిలేనిస్థలముగావలయు, కాబట్టియెక్కడచూచి న ను - నాపదార్థమేయుండవలసినదేగాని మరియొకదానికినవకాశము బొత్తుగానుండకూడదు - వేరగునొకయణువునకు స్థలముండినను పూ ర్వవస్తువు తుదిలేనిదనిచెప్పరాదు- కాబట్టిదేవుడు- సర్వత్రయున్నాడని చెప్పుట సరికాదు - లేదాయెచ్చటచూచినను, దేవుడేగానిపదా ర్థాంతరము లేదనిచెప్పవలయు- మనమున్ను అపరిచ్ఛేద్యమయిన దే వుడున్ను, కూడాయున్నామంటే, అతనియొక్కపరిపూర్ణతకు,సం కోచముగలుగుచున్నది- మరియు,ననంతమైనయాపదార్థము, ఘనప దార్థముగానుండవలసినది,శిలవంటిదిఅదిచలనరహితమైకూడాయుం డ వలయు నీయపరిచ్ఛేద్యమైన వస్తువుచలించుటకు నపరిచ్ఛిన్నమైన కాలముయావశ్యకము- యొకఘనపదార్థములో నంతశ్చలనముండదు సర్వత్రవ్యాపించియుండువస్తువునకు-బహిశ్చలనావకాశములేదు- చే ల్లననగా- స్థలమంతయును నదిగానెయున్నది ఇట్టివస్తువునకు తాకు టయు- నాలోచించుటయు, మొదలగునేక్రియలు- నుండజాలవు—

ఆవస్తువులో నాలోచించు శక్తి యొకభాగములోనైనా యుండవలయులేదా- ఆస్వరూపమందునంతటనైనా యుండవలయు నే మనోవ్యాపారమునకుగాని, అనగా ఆలోచనకుగాని కాలముపట్టును, ఆకాలము ఆయావస్తువులయొక్కయు బరిమాణమునకు ననుగుణముగానుండును, అనంతమై సర్వత్రయుండు వస్తువునకు, ఆలోచించుటయను శక్తికి కాలమంతయు కావలశియున్నది అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

ఉత్తరము.

నాస్తికుడుపరిపూర్ణ పదార్థములో నితరపదార్థము లెట్లుండును దానికి నవకాశ మెట్లనుచున్నాడు - ఇందుకునెగువనయఃపిండములోనగ్ని యెట్లున్నదో అట్లు బ్రహ్మమునందు సర్వశక్తులున్నవని- ప్లీఫార్ ఎతీయసం అనుగ్రంధము యొక్క ఖండనమునందు—౮-వ-కలములో వ్రాసియేయున్నాము - మరియు ననంతమైన బ్రహ్మమనుపదార్థము ఘనపదార్థముగా నుండవలశినది- శిలవంటిది-అయితే అది పూర్ణముగా నుండుటచేత గదలకుండ నుండవలయునని, చెప్పుచున్నాడు- పూర్ణమైనయొక ఘనపదార్థమైన రాయి బాహ్యముగా చలించుటకు నవకాశములేదు అంతశ్చలనమునకును నవకాశములేదు అనియంచున్నాడు - అంతరగ్నియును వృద్ధ్యాదులుచేయు చైతన్యమును శిలలోపల నుండలేదా చైతన్యములోపల చలనాది రూపకవృద్ధిచేయనిదే, బాహ్యవృద్ధియెట్లుకలుగును అయితే యుదిపరిచ్ఛిన్న వస్తువు బ్రహ్మము పరిపూర్ణుడుండగుటచేత బాహ్యచలనాదులు లేకపోవుటసరియగునుగాని, సర్వశక్తులతో బరిపూర్ణముగా నుండువానికి నంతశ్చలన ముండగూడదు- యెట్లనగా- ఆకాశముపరిపూర్ణముదానియందు, శబ్దగుణముండలేదా- మరియు ఆకాశమునందువాయువుపరి

పూర్ణముగానుండియు వాయువునతిశయముగాను, స్వల్పముగాను, ఆకాశమధ్యమునవీచుటను, చూచుచున్నాముగదా - ఇందువల్ల దేవుని యందుండు శక్తులకు అంతశ్చలనాదులేలయుండకూడదు-మరియు నా బ్రహ్మములో నాలోచించుశక్తి యొకభాగములోగాని అంతటగాని యుండవలయుననని, యనుచున్నాడు- దేవునియొక్క-జ్ఞానేచ్ఛా క్రియా శక్తులలోనే, సర్వశక్తులు నంతర్భూతములు యీశక్తులకు బరస్పరావకాశము బ్రహ్మములో నెట్లున్నదనియంటె, యిందుకు నొకకొట్టిడీలో, ననేకదీపములుంచితే అన్నిటియొక్క-ప్రభలు పూర్ణములుగాను, నొకదాని కొకటి బాధకములుకాకను, నెట్లు వ్యాప్తములై యున్నవో యట్లే దేవునియందుండు శక్తులు పూర్ణమైన దేవునియందంతటా, వ్యాప్తములై యున్నవనిపై గ్రంథఖండనమున (౬) వకలములో వ్రాసియేయున్నాము.—

మరియు నాలోచనకుగాలము, ఆయావస్తువుల యొక్క- పరిమాణమునకు, ననుగుణముగానుండును - బ్రహ్మము పరిపూర్ణుడగుటచేత, నతడు జగత్సృష్ట్యాదికార్యములు చేయు యోచనకుకాలమంతయు, కావలశియుండును - అనియనుచున్నాడు- ఇందుకర్థమేమో మాకునేమియు తెలియులేదు - ఎట్లనగా - పిపీలికము మొదలుకొనియేనుగు పర్యంతముగనుండు జీవజంతువుల స్థూలసూక్ష్మములను బట్టివాట్లవాట్లయోచనలకు,నంతంతకాలముకావలసినట్టు కనుపించలేదు- మరియు మనుష్యులలోనే, జ్ఞానవంతులకు నేవిషయములును గాల తామసములేకత్వరగా స్ఫురించుచున్నది - యిందువల్ల జ్ఞానవంతునికి యోచనకు దక్క-వకాలమే , కావలశియున్నదే గాని హెచ్చుకాలముతో జరూరులేదు - ఇట్లుండగాపైయాక్షేపమున కవకాశ మెట్లుగలిగెనో తెలియదు.—

కష్టములు లేకుండే సుఖములు ప్రకాశింపవు యీకష్టసుఖములే దేవుని శిక్షారక్షాదులకు ఫలములగుచున్నవనుట.

(౧౭) ఆశంక.

దేవుడు అపరిమేయమైన మంచిగానున్నాడని చెప్పుచున్నాడు ఆయన భూతములకు దండ్రివంటివాడనియు, కృపాస్వరూపుడనియు- చెప్పుచున్నారు- యిదేవాస్తవమైతే లోకములో చెరుపుఅనునదియుండగూడదు- అదిమెండుగానున్నది సాధారణముగా , లోకములో నొకమనుష్యుడు తనకుశక్తియుండియు దనచేతబోగొట్టదగిన కీడును పోగొట్టకపోతే, వానిని మంచివాడు కాడనిచెప్పెదరు- దేవునియొక్క శక్తియు- దెలివియు మంచితనమును నమేయములని చెప్పుచున్నారు- అట్లయితే చెరుపును ఎందుకుప్రపంచములో నుంచియున్నాడు- సర్వశక్తుడయ్యేనేని యన్నియు నతనికి నడగియుండవలయు- దేవుడేయొక్కడుండి యాలోచించి చేసినట్లయితే(౧) ఆయనకు దెలియకయేదియునుండదు-(౨) చెడు, లోకములో నుండుటచేత దానిని చెడగొట్టలేదుఆయనకు శక్తిలేనట్లులగు, చున్నది(౩) దానిని చెడగొట్టనతనికి, నిష్టము లేకుండవలయు- (౪) లేదాఅవి యుండుట ఆవశ్యకమని ఆయనకుదోచి యుండవలయు , నీనాల్గింటిలో నేదివాస్తవమైనను ఆయనసర్వ శక్తత్వాదులకు సంకోచము కలుగును - చెరుపు అనునది ఆయనచేతనే, సృజింప బడినదైతే , ఆయన యందు అమేయమైన చెడుగుణము ఇతరముల వలె నుండవలయు దేవునికి దెలియక చెరుపు అనునదిగలిగినదని చెప్పుట ఆయనయందు మౌఢ్యమునున్నూ దౌర్బల్యమునున్నూ ఆరోపించును - తేనవినాతృణ మపినచలతి, అని చెప్పబడు నాతనియందు- అజ్ఞానముకాని, అజాగ్రతకాని యుండ

రాదు - చెడుకావలయు ననియే, చేసెనంటె దేవుడు అతిక్రూరుడున్ను దుష్టుడునగుచున్నాడు అని - కొందఱీలాగు చెప్పుచున్నారు - ఇప్పుడుండు సంకటములు కీడులు మొదలగునవి, భవిష్యత్కాలమున, బోగొట్టబడుచున్నవని చెప్పుచున్నారు - ఇదియొక సమాధానమా- చెడుపు యొక్క స్థితికిన్ని, దేవునియొక్క మంచితనమునకున్ను, సామానాధికరణ్యము లేదు - అనుటకునీ సమాధానము సరిపడునా- రేపు కొంతవరకు జక్కపడినను, నిప్పటి సంకటములు సంకటములు కాక పోవునా- చెడుపుకూడా మంచికనియె కొందరు చెప్పెదరు - అయితే ఆమంచి మనకు దెలియదనెదరు - ఇదియొకయర్థములేనిమాట- లోకములో మనుష్యునియొక్క తెలివి- మంచితనము మొదలైనవి - యతని మాటల వల్లగాని కార్యములవల్లగాని తెలియవచ్చుచున్నది - పైరెండునుత్తమములైతే యామనుష్యుడు నుత్తముడనుచున్నాము - దేవునియొక్క మాటలనుమనము వినజాలముగనుక ఆయన కార్యములను బట్టియే, తెలుసుకోవలశినది ఆయన కార్యములు కొన్ని తెలివితో గూడినవిగాను, కొన్నిదానికి విరుద్ధములుగాను , కొన్నిదానికి మధ్యమములుగానున్నవి- కావునఆయనకు దెలివియు- దెలివిలేమియు,మధ్యమత్వమును నంగీకరింపవలయు- దేవునియొక్క సర్వజ్ఞత్వాదులను- ఆస్తికుడుకూడా ఆయనకార్యములనుబట్టియె చెప్పుచున్నాడు-కార్యములుపైనవ్రాసిన రీతులైయున్నవి-అపూర్ణములైన కార్యములనుండి పరిపూర్ణతనుస్థాపించుట యాస్తికముకాదు- ఎట్లు దుదిలేని జ్యోతిర్వాదము చేయువానికి గొంచమంధకారమును జూపుటఅతని సిద్ధాంతమును బడగొట్టుచున్నదో అదేప్రకారము తుదలేని మంచికి ఆకరము దేవుడు- అనివాదించు వానికి జెడుపునుజూపుట అతని సిద్ధాంతమునకు హానికరము- అనినాస్తికుడు చెప్పుచున్నాడు.—

## ఉత్తరము.

సదరుప్రకారము చెప్పే ఆస్తికుడుతమతమ, వేదములు ప్రమాణమనిచెప్పెడు మతపిచ్చిగలవాడు- ఇందువల్లదేవునియొక్క మంచితనమును గురించియిన్ని యాక్షేపముల కవకాశముకలిగినది - మనస్వాత్వ్యసిద్ధాంతము వారమగుమేము, సదరుప్రకారముచెప్పను, యికదేవుడెటువంటివాడంటే, పరిపూర్ణుడు సర్వశక్తిగలవాడు- సర్వేశ్వరుడు- జగత్కర్త- జగద్భర్త- నిత్యుడు - సర్వకారణకారణము, నీలాటిగుణములు గలవాడనిచెప్పుచున్నాము- ఎప్పుడు జగత్తును చేయుచున్నాడో - అప్పుడు తనలోనుండు చేతనాచేతనములకు మిశ్రముచేసి అచిత్తుకు స్వరూప వికాసమున్నూ - చిత్తుకు జ్ఞానవికాసమున్నూ గలుగజేసినరమృగ పక్షివృక్ష పాషాణాది నీచోచ్చస్వరూపములను గలుగజేసి, తత్తదనుగుణములైన జ్ఞానములను గలుగజేయుచున్నాడు- ఇదేరీతిగ సుఖదుఃఖాదులను మంచిచెడ్డలను గలుగజేసినాడు- ఇవియాయనయందు నాయాస్వరూపములుగా నున్నవాయని అంటే- ఆలాగునలేవు- అయితేకుమ్మరవాడు మృత్తుయందులేని ఘటశరావాదులను గల్పించినట్టు తనయందుండు సర్వశక్తులను, మిశ్రితముచేసి యాలాగునచేసినాడు - ఇట్లేలచేసినాడంటే తనయొక్క విలాసమే తప్పవేరెకారణములేదు - ఎట్లనగా - యొకరాజుతనవద్ద, ననేకశిల్పులుండినా, విలాసార్థముగ, దానొకచిత్తరువు వ్రాసినట్లు జేసెను.

అయితే యెప్పుడు ప్రపంచమనునది సృజించినాడో అప్పుడు మంచిచెడ్డలుండకుంటె యేదియు ప్రకాశించదు- ఎట్లనగా - రోగమువల్లనిరోగత్వము - దారిద్ర్యమువలనభాగ్యము - దుఃఖమువలన సుఖము - నుష్ణమువలనచలవ - చీకటివల్లవెలుతురు- స్త్రీవల్లబురుషుడు-

నీలాటిద్వంద్వములు లేక యొక్కటియు బ్రకాశించదు - మరియు మనుష్యునికి నింద్రియమనః ప్రాణములను నన్నిజంతువులకు నిచ్చినట్టే యిచ్చి బుద్ధినధికముగా నిచ్చినాడు- ఆబుద్ధిచేత స్వతంత్రముగా వాడు చేయు న్యాయాన్యాయములను బట్టి మంచిచెడు రూపముగా రక్షాశిక్షాదులను చేయుచున్నాడు—ఈసర్వమును దనకు విశేషణములైనట్టియు చేతనాచేతన మిశ్రితము చేసి సర్వశక్తి స్వరూపుడగుటచేత నిర్మించినాడు- అయితే కులాలునికివలె, నుపకరణములు పనిలేదు - కులాలుడు నిమిత్తకారణము- మృత్తు- ఉపాదానకారణము- బ్రహ్మ, మభిన్ననిమిత్తోపాదానకారణమగుటచేత, నుపకరణములు పనిలేదు - ఎట్లనగా, నొకవృక్షరూపముగా జేయుటకు - కీలుబొమ్మను చేయుటకు, శిల్పికి కొరముట్లు కావలసియున్నది—దేవుడు చేసిన వృక్షమునకు వృద్ధ్యాదులు గలుగుటకు కొరముట్లు పనిలేదు - పలుమాఱు చేయవలసిన యావశ్యకమును లేదు- మనుష్యుడు లేవవలె, చెయిచాచవలెనంటె, అందుకు పరికరములు పనిలేదు - ఎందువల్లనంటే - అందులో చేతనముండుటను బట్టి కార్యములగుచున్నవి - అట్లే భగవంతుడు చిదచిద్విశిష్టుడు గనుకను సర్వశక్తిమంతుడు గనుకను పరికరములు పనిలేదు—కాబట్టి మంచిచెడ్డలు ఆయనయందు స్వరూపముగా లేకపోయినా, పైన చెప్పినప్రకారముగ సృజించుచున్నాడు - గనుక యెగువ నాస్తికుడు చెప్పు దూషణలు పనికిరావు.—

నాస్తికుడు దేవుని యాస్తికత్వజ్ఞానము లేకపోతే, సన్మార్గప్రవర్తనయే, లోకములో నుండదని చెప్పుచున్నాడు— ఇది వాస్తవమైతే ఆస్తికులు లోకములో నప్పు చేయుట లేదా - యను మొదలైన. యుక్తులు వ్రాయుచున్నాడు.—

ఉత్తరము.

పూర్వగ్రంథఖండనలో ౧౦ వకలములోనిందుకు సమాధానము వ్రాసియున్నాముగనుక యిచ్చట వ్రాయవలసినంత యావశ్యకము లేదు.—

నాస్తికధ్వాంతభాస్కరము అనుగ్రంథమునందు,
సైమ్సుమతమునకు ఖండనము,
సంపూర్ణము.

—(*)—

థియాసఫిస్ట్ వ్రాసిన, యెసొటెరిక్ బుడ్డిజం అను గ్రంథముయొక్క ము ఖ్యాంశములకు ఖండనము.

ఆశంక.

౧ స్థూలరూపము,
౨ ప్రాణములేకజీవము,
౩ లింగశరీరం,
౪ కామరూపం,
౫ మనస్సు,
౬ బుద్ధి,
౭ ఆత్మ,

ఈ ౭ తత్వములు వేరువేరుకావు- ఒకటితోఒకటి కలిసియుంటున్నది.—

స్పిరిట్ - అనగాఆత్మ,
మెటల్ - అనగాప్రకృతి,
ఆత్మయొక్క పరిణామంభేదములేను - యీభేదములేక ప్రకృ

తియొక్క పైపై అంతస్థులు- యీయేడుఅనిన్ని చెప్పవచ్చును.

స్థూలరూపము రెండవదియగు ప్రాణముచేరితే చైతన్యముగల ప్రకృతియగుచున్నది కారణకార్యములు యేకజాతియని చెప్పుతారు- చావుటయిన గాపై యేడింటిలో పైమూడు - అక్కడనేయుంటున్నది- తక్కిననాలుగు ఆశరీరమును విడిచిపోతున్నది.

౨, ప్రాణము చచ్చిన దేహము శిధిలమైనతర్వాత మరివకకీట కాది రూపములో చేరుతూవుండుచున్నది - దేహంకాల్చితె అప్రాణం పూర్వంయీశరీరమున యెక్కడినుంచివచ్చినదో అక్కడినుంచె తనకు అనుకూలమైన శరీరములలో చేరుతున్నది.

3, లింగశరీరము యిల్లుకట్టుటకు ప్లానువంటిది యిదిస్థూల శరీరమును గలుగజేయుటకు జీవముతో కూడాపరిమాణమునుజేర్చి - స్థూలశరీరమును గలిగించుచున్నది ఈలింగశరీరము క్రిందినాల్గురూపముల సంబంధముచేత తాను ప్రాణముగలదియగుచున్నది - చచ్చినవెనుక యీలింగశరీరము సూక్ష్మకాలము - స్థూలరూపముతోనుండి వేరయికొన్ని హేతువులలో ప్రక్కనుండిమనుష్యులకు అగుపడడంగలదు - ఇదెదయ్యమనిచెప్పుతారు - యివెదయ్యములా - అనియంటె- దయ్యములు వేరువున్నవిగాని ఇదికనుపడుటచె గాకదీనికిప్రాణములులేవు - చచ్చినవెనుక ఆశరీరములయొక్క సమీపములోనె కనుపడును గాని దూరముగా చచ్చినశరీరమును విడిచికనుపడేదికాదు - కొందరికి బ్రతికియుండగానె లింగశరీరంబయిట రావడంగలదు అదిమీరుపరకాయప్రవేశమనేవి - ఆతరుణములో ఆశరీరముప్రజ్ఞలేకుండా యుండును అప్పుడు ఆశరీరమును వేరేస్థళములలో మార్చితె ఆలింగశరీరము జోరబడజాలక మనిషిచచ్చిపోను - రూపము - ప్రాణము - లింగశరీరము - ఈమూడుభూమితో విశేషముగా చేరినవి.అయినందున-

చచ్చినప్పుడు యీమూడును వదిలిపెట్టవలసినది.

౪, కామరూపము అనగాకోరినరూపమును యిచ్చునదికాదు- యిచ్చపుట్టేస్థానము కామక్రోధాదులు జన్మించుస్థానము- యిదిమృగములకుముఖ్యతత్వము-అయిననుమనుష్యులకుగూడా- యీతత్వము ఆవశ్యకమేను - యీతత్వము మనస్సుఅనేతత్వమునకు లోబడియుండుటకద్దు -మనస్సును లోబరుచుకొనితాను హెచ్చివుండుటయుకద్దు మనస్సుకులోబడితె వృద్ధికికారణమగుచున్నది - లేకుంటెపశుప్రాయుడగుచున్నాడు.

౫, మనస్సు వివేకమును- జ్ఞప్తికిస్థానము అయ్యిందిసిద్ధులు యోగులు. తనలింగ శరీరముతో బహుదూరము కనుపడుచున్నాడనిచెప్పునపుడు- నీమనస్సుయొక్క యంశము - కామరూపముతో చేరివచ్చుటయె- ౫వతత్వమైన మనస్సుజనులలో అనేకులలోలేకయుండు- యిదివరకు పూర్ణముగా వృద్ధిపొందలేదు- ౫వదిపూర్ణము కాకయుండగా ఆరవదియొక్కసూక్ష్మముగా నున్నదే గాని - దానికార్యము ప్రాచుర్యము కలుగలేదు - యేడవది చెప్పవలసినదిలేదు - యేడవది ప్రవేశించే కాలమునమనుష్యుడు మనుష్యుడుకాడు - బాగాప్రవేశించినతర్వాత అన్నిటికి వుత్తమమైనస్థితిని పొందుచున్నాడు.——

జన్మాంతరమనగా మొదటిమూడు తత్వములు యిక్కడనేనిల్చిపోయెను యెట్లుదేహాంతరంబు లగుచున్నవంటె - యిప్పటిఅయిదవది మనస్సుతాను స్వకీయముగా యుండేదికాదు - గనుక నాలుగ కామరూపముతోచేరి జన్మాంతరములయందు దేహమునకుకారణమగుచున్నది సూక్ష్మ రూపముగాయుండెడె ఆరవదానితో మనస్సుయొక్క ముఖ్యాంశముచేరి- జీవరూప మగుచున్నది- ఇందువల్లయీజన్మములోచేసిన వాసనగలిగి యుంటున్నదిలోహమునకు క్రిందమూడు

తంత్రములు- యున్నవి - అవియిట్టివని చెప్పుటకు సాధ్యముగాదు- లోహము మొదలుకుని వెంబడి- శాకముమృగము- మనుష్యుడు - మెటర్ - ప్రకృతి- స్పిరిట్- పురుషతత్త్వము-వీట్లసంబంధమువల్ల పైచెప్పినవస్తువులు - కలుగుచున్నవి - అయితె హెచ్చుకు పోయిన వెనుక తక్కువకు రావడములేదు- అనిచెప్పుచున్నారు.—

ఉత్తరము.

మొదలచెప్పిన ౭తత్త్వములు వేఱువేఱుకావని వ్రాయుచున్నాడు- స్పిరిట్అనగాఆత్మ - ఇవిఆత్మపరిణామ భేదములేయని వ్రాయుచు, నీయేములేక, మెటర్ అనగా ప్రకృతియొక్క పైపైఅంతస్థులు అని చెప్పుచున్నారు- ఒకచోట ఆత్మపరిణామము లనివ్రాయుచు, నొకచోటప్రకృతియొక్క అంతస్థులనివ్రాయుట, యెంత యసంగతమో యోచించుడు.—

మరియు స్థూలరూపము రెండవదియగు ప్రాణము, చేరి తేచైతన్యముగల ప్రకృతియగుచున్నది - కారణకార్యములు ఏకజాతియని చెప్పుచున్నారు - ఇవిచచ్చినవెనుక, నివి 3 భూమితో జేరినవైనందున, నిక్కడనేయుంటున్నవని చెప్పుచున్నారె,చచ్చినవెనుకయాశరీరముతో జైతన్యమున్నదని యెవరేని చెప్పగలరా.

మఱియు మొదలజెప్పిన ౭ తత్త్వములు వేఱుకావు, ఆత్మగుణములనియొకచోట, ప్రకృతిగుణములని యొకచోట, వ్రాయుచు, జచ్చినవెనుక, మూడుగుణములు ఇక్కడయుంటున్నవి - కడమనాలుగు గుణములు, పోవుచున్నవని, చెప్పుచున్నారు- వేఱుకానిగుణములు కొన్ని యెట్లువిడిచిపోవునో యోచింపుడు —

మఱియు జచ్చినవెనుక యీలింగశరీరము సూక్ష్మకాలము స్థూలరూపముతో జేరియుండి, వేరైకొన్నిసమయములలో, ప్రక్కనను

డుమనుష్యులకు నగుపడుటగలదు.

ఇవేదయ్యామని భ్రమించుచున్నారని వ్రాయుచున్నాడు-చచ్చి నవెనుకనిక్కడనే, యుంటున్నవని వ్రాసినవానిలో మూడవదియగు-లింగశరీరము స్థూలశరీరముతో వేరై కొందరకు గనుపడుచున్నదనుట, యెంతపూర్వోత్తరవిరోధమో, చూడుడు.

మఱియునిదే, దయ్యామనిచెప్పుచున్నారు - ఇదికనుపడుటయే గాని, ప్రాణములేని హేతువుచేత దయ్యములుగావు - కొందఱకు బ్రతికియుండగానే, లింగశరీరము బైటరావడముగలదు - దానినిగొందఱుపరకాయ ప్రవేశమనుచున్నారని వ్రాయుచున్నారు - శంకరాచార్యులు అమరుకకాయప్రవేశముచేసి, ఆయనభార్యలతో గ్రీడించికళాశాస్త్రమును తెలిసికొన్నాడని పిచ్చిమాటలు, వ్రాసియున్నవి - అదినిజమైతే, ఆలింగశరీరమునకు, ప్రాణములేదని, వీరువ్రాయుచున్నారే, కళాశాస్త్రపరిజ్ఞానంబెట్లుగలిగెను.

మఱియునట్లు లింగశరీరము- వేరైన స్థూలశరీరమును, స్థలము మార్చితే లింగశరీరము, జొరబడజాలక, మనుష్యుడు చచ్చునని వ్రాయుచున్నారే, యింతదూరము పరకాయప్రవేశముచేసి యనుభవించివచ్చిన లింగశరీరము, గుడ్డిదిగాబోలును- స్థలము మార్చుటచేత, స్థూలశరీరములో, జొరబడజాలక, పోవుటకు- అట్లయ్యెడి పక్షములో శంకర విజయములో శంకరాచార్యుల దేహమునువేరేతెచ్చికాల్చుచునుండగా- అప్పుడుజొరబడి దహించుచునుండు స్థూలదేహము లేవజాలక, లక్ష్మీనృసింహ మమదేహికరావలంబం అనిస్తోత్రము చేయగాభగవంతుడు చెయ్యిచ్చి లేపినాడనియున్నదే, స్థలముమార్చితేతిరుగా శంకరాచార్యులు యెట్లుబ్రతికెను - మరియుసిద్ధులుయోగులుతనలింగ శరీరములో బహుదూరము కనుపడుచున్నారని చెప్పిన

పుడు - యీమనస్సు యొక్కయంశము కామరూపముతో చేరివచ్చు టయేయని వ్రాయుచున్నారు- ఇట్లుమా పురాణాదులలో ఋషులుత మహెాచ్చుటకు - చెప్పుకొన్న పిచ్చిముచ్చటలని నిర్ణయించినాము - యెందువల్లనంటే వసిష్ఠాదులు, పౌరాహితులుగా నుండి, దశరథుని చావుదూరముగా నుండుభరతునికి- తెల్పజాలక చారులనుపంపించిపిలి పించి నట్టులున్నదే, వారుపయిన వ్రాసినప్రకారం కామరూపమును పంపించి సమాచారము తెల్పజాలకపోయిరి- పూర్వముయేమి యిప్పు డుయేమి. చక్రవర్తులు చారులచేత పత్రికలచేత, వర్తమానములు- తెప్పించు కొనుచున్నారు గాని అట్టియోగులనుంచుకొని పైనవ్రాసినప్ర కారంసమాచారము తెలుసుకొనుటలేదు- ఇంతేగాకవిచారణ కాలము లోసాక్షి సాధనములవల్ల - న్యాయాన్యాయ ములకును గొనుచున్నా రుగానియిట్టి యోగులనుంచుకొని పరోక్షమును, దెలియుటలేదు- మరి యుఅయిదోతత్వం పూర్ణము గాకయుండగా- ఆరవదియింక సూ క్ష్మముగా నున్నదేగానిదానికార్యము ప్రాచుర్యముగలుగలేదు-యేడో దిచెప్పవలసినదిలేదు-యేడోది ప్రవేశించు కాలమున,మనుష్యుడు,మను ష్యుడుకాడు- బాగా ప్రవేశించిన తర్వాత అన్నిటికి నుత్తమమైనస్థితిని పొందుచున్నాడని వ్రాయుచున్నారు- ఇదేవారిలోముక్తి అనిచెప్పుదు రేమో- పైనవ్రాసిన హేతువునుపట్టి- చూడగా- ఆతత్వములుతనంత టనేవృద్ధికి వచ్చులాగున నున్నవేగాని యోగులప్రయత్నముచేత వృద్ధికి వచ్చేవిగా కనుపించదు- ఇందువల్లవీరి యుపదేశము - ఏలనుఆప్రకా రముప్రయత్నముచేయుట యేలనుమరియు జన్మాంతరమనగామొదటి మూడుతత్వములు యిక్కడనేనిల్చిపోయెనే ఎట్లుదేహాంతరంబు లెత్తు చున్నదంటె- యిప్పటిఅయిదవదిమనస్సు- తానుస్వకీయముగానుండేది కాదుగనుకనాలుగే కామరూపముతో చేరి జన్మాంతరములయందు

నా స్తికధ్వాంతభాస్కరము,

దేహామునకు కారణమగుచున్నది సూక్ష్మరూపముగానుండు,ఆరవదా నితో మనస్సుయొక్క ముఖ్యాంశము, జేరిజీవరూప మగుచున్నది ఇందు వల్ల ఈజన్మములో జేసినవాసనగలిగి యుంటున్నది అనివ్రాయుచు న్నారు జన్మాంతర వాసనయుండెనేని పూర్వముతాను అనుభవించి నది సప్రకారముగా తెలియరావచ్చును - అట్లు తెలిస్తేప్రపంచములో నిన్నిమతములు లేకవక్కటే మతమగును-

ఈగ్రంథములో ముఖ్యముగా, వ్రాసియున్నయేడు తత్వము లు అవితనంతటకాల క్రమముగా, వృద్ధిపొందుచు వచ్చుచున్నవనియు వ్రాసియున్నదేగాని వీటిని యీశ్వరుడు పుట్టించినట్లు - వ్రాయలేదు. ఇందువల్లనవి స్వభావసిద్ధములని యెంచవలెను - యెగువమతములను ఖండించి మేమువ్రాసిన దృష్టాంత దార్ష్టాంతములలో కారణములేక కార్యము పుట్టదనియు నాకారణము జడమయిన యెడల వివిధవిచి త్రమై ప్రతివస్తువు, ననుపయోగము కానిదైయీచేతనాచేతన మిశ్రిత మయిన ప్రపంచము సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులుగల భగవంతునిచే తనే, గలుగవలసినదనియు - అట్టికర్తయైన యీశ్వరుడులేక ప్రపం చముస్వనియమమును తప్పక నడవజాలదనియు వ్రాసియున్నాము ఇందువల్ల - యీమతము కూడా నాస్తిక మతమనిపించుకొంటు న్నది.—

నాస్తికధ్వాంతభాస్కరమునందలి,

పూర్వభాగము, సంపూర్ణము.



శ్రీరామ.

# ఉత్తరభాగము,

## (*) సౌగతమతఖండనము, (*)

బౌద్ధాగమము సుగతాచార్యునిచే జేయబడినది- ఆసుగతాచార్యునకు నలుగురు శిష్యులు-సౌత్రాంతికుడు, వైభాషికుడు, యోగాచారుడు, మాధ్యమికుడు, ఈనలుగురు యీశ్వరుడు లేడని చెప్పువారు

ఇందులో మొదటి ముగ్గురు సమస్త పదార్థములు క్షణికములని యొప్పుకొనువారు నాలుగవవాడు యేపదార్థములు లేవనియు శూన్యము తత్వమని చెప్పుచున్నాడు.

సౌత్రాంతికుడు వైభాషికుడనే యీమొదటియిద్దరు- బాహ్యపదార్థములనున్ను, అంతరమైనజ్ఞాన సుఖదుఃఖాదులనున్ను, ఒప్పుకొనుచున్నారు- వారిలో మొదటి వాడగు సౌత్రాంతికుడు బాహ్యపదార్థములు ప్రత్యక్ష సిద్ధములని, చెప్పుచున్నాడు- రెండవవాడగు వైభాషికుడు బాహ్య పదార్థములు జ్ఞానముచేత నూహించ దగినవేగాని ప్రత్యక్షసిద్ధములు గావని చెప్పుచున్నాడు- మూడవవాడైన యోగాచారుడు బాహ్య పదార్థములే లేవనియు, అంతరమైనజ్ఞానాది పదార్థములుమాత్రముకలవనియు, ఆజ్ఞానమే, ఘటపటాద్యాకారము గలిగివిషయములవలెనే యగుపడుచున్నదనియు, జెప్పుచున్నాడు.—

వీరిలో మొదటి యిద్దఱుఆంతర పదార్థములను రూపస్కంధము, విజ్ఞానస్కంధము , వేదనాస్కంధము,సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము అనిఅయిదు విధములుగా నేర్పఱచియున్నారు.వీటి

లోవిషయేంద్రియములు రూపస్కంధమనియు, నేను నేను నేను అనేజ్ఞానపరంపర విజ్ఞానస్కంధమనియు, యీవిజ్ఞానస్కంధముకే ఆత్మయని పేరనియు, సుఖదుఃఖాద్యనుభవజ్ఞానమే వేదనాస్కంధమనియు, గోవు, అశ్వము - ఇత్యాదిజ్ఞానపరంపర సంజ్ఞాస్కంధమనియు, రాగద్వేష మోహాదులే సంస్కారస్కంధమనియు జెప్పుచున్నారు.—

వీటిలో రూపస్కంధము తప్పతక్కిన నాలుగు స్కంధములు మూడవవాడు ఒప్పుకొనుచున్నాడు.—

మొదటివారిద్దరు పృథివ్యప్తేజోవాయుపరమాణువులు గుంపుగుంపుగాజేరి, ఘటపటమనుష్యపశుదేహాద్యాకారములుగా, పుంజములుగానగుచున్నవనియు, ఆపుంజములలోక్షణేక్షణే యొకపుంజము వలనమరియొకపుంజము గలుగుచున్నదనియు ఆంతరపదార్థములలో జేరినసంజ్ఞాస్కంధము అనేఘటపటాది సంజ్ఞాజ్ఞానమునకున్ను, ఘటపటాదిరూపపరమాణు పుంజమునకున్ను పరస్పరసంబంధము కలుగుటవలన, లోకవ్యవహారము యావత్తుసిద్ధించుచున్నదనియు జెప్పుచున్నారు.

మూడవవాడగు యోగాచారుడు జ్ఞానము, విషయములతో జేరి, విషయాకారమైతేనే గాని లోకవ్యవహారము సిద్ధింపదని యనుభవమునువిషయములున్నవని చెప్పుపైవారుకూడా ఒప్పుకొనుచున్నారుగనుక, జ్ఞానము విషయాకారమగుటవల్లనె వ్యవహారములు సిద్ధించుచుండగా, వ్యవహారానుపయుక్తమగు బాహ్యవిషయములను, ఒప్పుకొనుటకు వేరేప్రయోజనములేనందున, బాహ్యవిషయములు లేవనియు, తానుఅంగీకరించిన ఆంతరజ్ఞానమువల్లనే, పైవివరింపంబడినరీతిగా, లోకవ్యవహారము సిద్ధించుచున్నదనియు, బాహ్యవిషయము లేకజ్ఞానము యొక్కయాకార భేదములవల్లనే, వ్యవహారసిద్ధి స్వప్నస్థలములో నందఱివల్ల నొప్పుకొనబడి యున్నదిగనుక, ఆప్రకారమే

యిచ్చటనున్న నిర్వాహము కలుగుచున్నదనియు జెప్పుచున్నాడు.

ఉత్తరము.

ఇదిసరికాదు- మొదటియుద్ధటిపక్షములో క్షణికములైనఘటాదివిషయములకునట్టి యింద్రియములకును సంబంధముకలుగు క్షణములోనే నాశముకలిగిపోతే, ఆవెంబడిక్షణములో నశించిన యింద్రియములచేత, నశించినవిషయప్రత్యక్ష మెట్లుకలుగును. వెంబడిక్షణములో బుట్టువిషయములకు, అట్టియింద్రియములచేత ప్రత్యక్షముకలుగుచున్నదని చెప్పుటకు దత్పూర్వక్షణములో ఆవిషయేంద్రియములకు సంబంధములేదుగనుక వల్లపడదు- సజాతీయమైన విషయములుక్షణేక్షణేపుట్టుచున్నవిగనుక, యింద్రియములతోసంబంధించినవిషయములునశించుచుక్షణేక్షణేపుట్టుచున్న సజాతీయ విషయములకు, ప్రత్యక్షము కలుగుచున్నదని చెప్పినా, ప్రమాతయగుఆత్మయునుక్షణేక్షణే వేఱువేఱుగాబుట్టునట్లునొప్పుకొనవలసివచ్చునుగనుక ఘనపంటితో విషయమును జూచినవానిసజాతీయుడగు మఱియొకయాత్మకు, ఆవిషయప్రత్యక్షము కలుగుచున్నదని చెప్పుట- ఎవరివల్లను నొప్పుకొనబడదు.

విషయములు లేవని చెప్పుయోగాచారుని పక్షములోనున్నా, యేజ్ఞానమునకు ప్రథమక్షణములో విషయాకారము కలిగినదో, ఆజ్ఞానమును ఆక్షణములోనే, ఆజ్ఞానముగలజీవులతోగూడ నశించిపోవుచున్నదిగనుక, ద్వితీయక్షణములో గల్గినమఱియొక, ఆత్మకుపూర్వమున శించినజ్ఞానాకార విషయప్రత్యక్షము, కలిగినట్లుచెప్పుటయు, మొదటి [illegible]నివంటిదేను.

ఇదిగాకను గాక, [illegible]నులకు యీబాహ్యాభ్యంతర పదార్థ[illegible] [illegible] నీ [illegible] [illegible]టున్నారని వీరినడిగితే, తత్తదు[illegible] [illegible] సజా[illegible] [illegible] వులను బుట్టింగుచున్న

విగనుక, వాట్లసత్తును అంగీకరించుచున్నామని చెప్పుచున్నారు- ఇట్లయితే, ఒకడుపగలగొట్టుటవల్లగాని, స్వభావముగాగాని, నశించే పదార్థము తద్ద్వితీయక్షణములో సజాతీయమగు, పదార్థాంతరముకల్పించుటలేదుగనుక, సత్తుకానేరదు అదిసత్తుకాకపోతే, తత్తత్పూర్వక్షణోత్పన్న పదార్థములుగూడ, యిట్టివేయగుచున్నవిగనుక, సత్తైన పదార్థమే లేకపోవలసి వచ్చును.

ఇంతేగాక, పదార్థములు క్షణికములని చెప్పువారిని, ఆక్షణికపదార్థములవలన తత్తత్సజాతీయ పదార్థములే, యుత్తరోత్తరక్షణములయందు గలుగుచున్నవనియొప్పుకొనుచున్నావా, లేక, అనియతముగా సజాతీయ, విజాతీయ పదార్థములు పుట్టుచున్నవనియొప్పుకొనుచున్నావా, యనియడుగవలయును, సజాతీయములే, కలుగుచున్నవనియంటే, ఒకపదార్థము విశీర్ణమైపోవునపుడు విజాతీయసంతానముకలుగకపోవలసివచ్చును- అనియతమనియంటే ఒకటేమనుష్యాదిశరీరము, మొదటిక్షణములోమనిషిగాను, రెండవక్షణములో గోవుగాను, మూడవక్షణములో గుఱ్ఱముగానుయిట్లు అనియతముగా, గనుపడవలసివచ్చును.

రెండియు, ఘటాది పదార్థములు ప్రథమక్షణమందు పుట్టునపుడుదండచక్రాదులును,వాట్లనుజేయు కులాలాదులును కారణములుగానుండుటవల్ల వాట్లవల్లఘటాదిరూప పదార్థములు కలుగుచున్నవి- అవిక్షణికములైతే ఒకఘటముచేయుటకే యనేకక్షణములు పట్టుచున్నదే - అక్కడికి ఘటోత్పత్తియే లేకపోవలె - ఆఘటముకలిగినపిదప, ద్వితీయతృతీయాక్షణాదులందుగలుగునట్లు నీవల్లనొప్పుకొనబడ్డ ఘటాదులకు, దండచక్రాది కారణములు లేవుగనుక, అవియెట్లుపుట్టుచున్నవని యడుగవలయును, ప్రథమక్షణమందు బుట్టుఘటాదులకేదండ

చక్రాదులు కారణములగుచున్నవి- ద్వితీయతృతీయాదిక్షణములయందు బుట్టుఘటాదులకుబ్రథమాదిక్షణములయందుండు ఘటాదులే కారణములగుచున్నవిగాని, దండచక్రాదులు కారణములుకావనియంటె, ప్రథమక్షణమందు ఘటముపుట్టునపుడు దండచక్రాదులు ఆక్షణమందుండిగదా కారణములైనవి - ద్వితీయక్షణమందు ఘటముపుట్టునపుడు- ప్రథమక్షణోత్పన్నఘటము నశించిపోయెనుగనుక అదియెట్లుకారణ మగును- కారణములేకనే కార్యము పుట్టవచ్చునంటె, సర్వత్ర సర్వపదార్థములుకలుగవలసివచ్చును— ప్రథమాదిక్షణోత్పన్నఘటాదులు ద్వితీయాదిక్షణములలో లేకపోయినను- పూర్వక్షణమందుండుటమాత్రము వల్ల నే కారణ మగుచున్నదనియంటె, ప్రథమక్షణోత్పన్నమగు నొకఘటముచేత, ద్వితీయక్షణములో సకల పదార్థములు, అచ్చటకలుగ వలసివచ్చును- సజాతీయములకే కారణమనియంటే, ప్రథమక్షణోత్పన్నమగునొక ఘటముచేత, సజాతీయములగు సకలఘటములు కలుగ వలసివచ్చును.

ఒకదేశమునందు ప్రథమక్షణమందుండుఘటము, ఆదేశమునందుద్వితీయక్షణమునందు గలుగుఘటమునకు గారణమగుచున్న దంటే, దేశమునుగూడ క్షణికమని చెప్పునీవు ఆలాగుచెప్పుటకు వల్లపడదు.—

మఱియు సకలపదార్థములు క్షణికములని చెప్పువారిని యేదృష్టాంతమునుబట్టియీ రీలాగుచెప్పుచున్నారని యడిగితే-

మెఱుపు మొదలగువాట్లను, క్షణికములుగా జూచుచున్నాముగనుక, వాట్లదృష్టాంతముచే, నన్నిపదార్థములు క్షణికములని యూహించుచున్నామంటే, అదియునుసరిగాదు- ఏలనంటే మెఱుపు మొదలగునవికూడ, నాలుగైదుక్షణములున్నట్లు కనుపడుచున్నవేగాని, యొకక్షణమందేనశించు నట్లుకానబడవు మఱియును ఆమెఱుపువెనుక, స

జాతీయవిజాతీయ సంతానమునున్ను పుట్టించలేదు - అనుభవానుగుణముగా నంగీకరించునెడల, యేయేపదార్థము యెంతకాలముండున ట్లనుభవమునకు వచ్చుచున్నదో, యంతపర్యంతముండు నట్లులవశ్యముగా నొప్పవలయును.

మఱియును నిన్నచూచినయొక ఘటమును నేడుచూచితే నిన్న చూడబడిన ఘటమేయిదియని యొకప్రత్యభిజ్ఞ గలుగుచున్నది - యీ ప్రత్యభిజ్ఞ యాఘటమునకు, క్షణికత్వమునుబాధించి, కొంతకాలపర్యంతము స్థైర్యమును గనుపఱచుచున్నది.

విషయియైన యాత్మకునిన్నజూచిన దె యీఘటమనుప్రత్యభిజ్ఞ గలుగుటవలన ఆత్మక్షణికమైతే నిన్నచూచినయాత్మ నశించిపోయెనే, యీప్రత్యభిజ్ఞ యాత్మకునెట్లుగలుగును గనుకఆత్మకుగూడ స్థిరత్వము నంగీకరింప వలసినదేను.

విషయములుస్థిరముగా నుండునవియైతే యచేతనములకు క్రమముగా, దరుగుకల్గుటయును, జేతనాచేతన మిశ్రిత విషయములకు క్రమముగా వృద్ధిగలుగుటయును నెట్లుసంభవించును.

ఇందువలన బ్రతిపదార్థములు ప్రతిక్షణమందు వేఱువేఱుగా బుట్టుచున్నవనియంటే, యచేతనవస్తువులు, నాతాతపాదులచే బీల్చబడిరసముగలవై, కొంతతరుగుచున్నవి—చేతనాచేతన మిశ్రితపదార్థములు, భూజలాదుల నాకర్షించుటవలన, నాపదార్థములకేవృద్ధిగల్గుటయు, ననుభవసిద్ధముగా నున్నదేగాని, యాసమస్తపదార్థములు ప్రతిక్షణములో బుట్టుచు నశించుచు క్షణికములుగా నుంటున్నవనివాదు చెప్పుట, పైనవ్రాసిన యుక్తుల యన్నింటిచేత, సరియైనవిగావని, బుద్ధిమంతు లూహింపగలరు.

బాహ్య పదార్థములు లేవనియు, నాంతర పదార్థములు

మాత్రమే యున్నవనియు, నవియు క్షణికములనియు , జెప్పువారికిని వైనజెప్పబడిన దోషములన్నియు, సంబంధించు.టే గాక, బాహ్యాపదార్థము లేలేనపుడు, జ్ఞానముబాహ్యాపదార్థాకారముగా బరిణమించుచున్నదని యెట్లు చెప్పవచ్చును.

స్వప్నమందు బాహ్యాపదార్థములు లేకనే, విషయానుభవము సంభవించుచున్నదని, యీదృష్టాంతముచెప్పుతారు అదియుసరికాదు.

ఎందువల్లనంటే, జాగ్రద్దశకు స్వప్నదశకుజాలాభేదముకలిగియున్నది. స్వప్నానుభవమైన పిదపజాగ్రద్దశయందు, స్వప్నములో నిట్లుభ్రమించితినని, స్వాప్నపదార్థము లన్నియు బాధితములగుచున్నవి- జాగ్రద్దశలో, ననుభూతపదార్థములు ఎప్పుడును బాధింపబడుటలేదు కాబట్టిస్వప్నముదీనికి దృష్టాంతము కాజాలదు.

ఇందువలననను భవానుగుణము గా బాహ్యాపదార్థములను ఆభ్యంతర పదార్థములను యథాసంభవముగా స్థిరములుగానేయొప్పుకొన వలయును.

ఇవిస్థిరములైనను గాకపోయినను వీనినంత జేర్చుటకునొకకర్త లేకపోతే, యచేతనములగు నీపదార్థములు తమంతట చేరజాలవుకాబట్టికర్తనున్నుఒప్పి తీరవలయును.

సుగతాచార్యుని నల్గురిశిష్యులలో గడపటివాడగు మాధ్యమికుడు సర్వశూన్యవాదము చేయుటసర్వలోకానుభవవిరుద్ధమైనది గనుక వానికి బదులు చెప్పుటయు ననావశ్యకమేను.

అయినను శూన్యము చేతశూన్యమని యెఱుంగుటకంటె పరమార్థము లేదని వాడు చెప్పుచున్నాడు. ఇదియెంత యసంగతమైనమాట ఎట్లనగావాని మతములోఆత్మ అంతఃకరణము శూన్యములామెనేశూన్యమని దేనిచేత దెలుసుకొనవలసినది.

సుగతాచార్యుడు తనశిష్యులనల్గురికి నాలుగు విధములుగ ను పదేశించుటవలన, నతనికే తత్త్వవ్యవస్థ కలుగలేదనియు, నీసౌగతమ తముసరిగాదనియు దోచుచున్నది.

—* చార్వాకమతఖండనము. *—

పృథివీజలతేజో వాయువులనునాలుగు తత్వంబులుగలవనియు, నవినాలుగుంగూడి పుట్టుదేహమునవాని సంయోగవిశేషమువలనం దమ లపాకునుపోకలును సున్నంబునుగూర్చి నమలునప్పుడుగల్గు సంయోగవి శేషంబున, నెఱ్ఱదనంబనుక్రొత్తగుణంబువొడమినట్లు చైతన్యంబుపుట్టు నింతియేగాక దేహాతిరిక్తంబగు నాత్మయనువస్తువు లేదనియుందనకుజీ వించియుండునపుడుగలుగు సుఖదుఃఖంబులుందక్క వేఱుస్వర్గనరకలో కంబులులేవనియు నట్టిపృథివ్యాది భూతసంయోగవిశేషంబు వీడుటయ ను,మరణమున, నచ్చైతన్యము నశించుననియుం జార్వాకమతము-అది యే లోకాయతమతము ఇదిబృహస్పతిచే జెప్పబడినట్లు పాద్మపురా ణములో నుత్తరఖండములో జెప్పబడియున్నది.

ఇతడు మహర్షియైనను, యజుర్వేదముతైత్తిరీయ కోపనిషత్తు ఆనందవల్లిలో పూర్వముఅసత్తే యుండెననియు, ఆయసత్తువలన స త్తుపుట్టెననియునుండుటచేత వాటినిజూచి నమ్మియీప్రకారమువ్రాసి నారు, యిదియెంతయసంగతము- పృథివీ జల తేజో వాయువులు త మంతటజేరి .రూపాదులుగలిగి,యందులోజైతన్యాదులు గలుగుచున్నవ నియెంచునెడల, మనుష్యాదిజంగమస్థావరరూపములు,నియతముగ, నే లగలుగవలయును - సగముశరీరముమనుష్యుడు సగముపశువుగ నిట్టి భేదములుగలుగవచ్చును- చైతన్యాదులుగూడ బశుచైతన్యము మనుజు నికి మనుజచైతన్యము పశువునకు గలుగవలసి వచ్చును - ఇందువల్లస ర్వశక్తిగల భగవంతుని నంగీకరింపకవిధిలేదు - మరియు చంద్రసూ

ర్యసముద్ర బుతువర్షాదులు ఎవరిశాసనముమీద, తమతమ, ధర్మములయందు తప్పకనిలుచును - అందఱుమనుజులు విద్యాభాగ్యాదులనుగోరిప్రయత్నింపనివారులేరుగదా, యవి వారివారి యిష్టప్రకారముగ సిద్ధించినవా, అయితే వారిప్రయత్నలోపమువలన సిద్ధింపలేదనియంటే, యత్నముగా గొప్పకార్యములు సిద్ధించుచు నుండుట జూడలేదా, అల్పాయుష్యదీర్ఘాయుష్యాదులు కలుగుచుండుట చూడలేదా, అదియు వారియత్నలోపమేయంటే, చక్రవర్తులైనవారు అంగబలము అనగా, వైద్యులు మొదలగువారు; అర్థబలమనగా ద్రవ్యాదులు యివిపూర్ణముగాగలిగియుండిజరామరణదారిద్ర్యాదులు రాకుండదప్పించుకొనిరా, యిందువలన వారివారి యదృష్టానుసారముగ దేవుడు కలుగజేయుఫలములని మనుష్యమాత్రునికి దోచకపోవునా - కాబట్టి యీచార్వాకమతము సరిగాదు.

—(*) జైనమతఖండనము. (*)—

జైనమతములో జీవుడని, యజీవుడని, యాస్రవమని, సంబరమని, నిర్జరమని, బంధమని, మోక్షమని ౭ పదార్థములుగలవు.—

జీవుడనగా సుఖదుఃఖాదిభోక్త - అజీవుడనగాజీవుడుకానిది భోగోపకరణము - తక్కినవిన్నైదును యీయజీవమనుపదార్థము లోజేరినవైనను - వైశద్యార్థము వేఱుగా జెప్పబడినది. ఆస్రవమనగావిషయములయందునింద్రియప్రవృత్తి - సంబరమనగా ఆయింద్రియప్రవృత్తినినిరోధించు యమనియమాదులు - నిర్జరమనగాకల్మషములను బోగొట్టు సప్తశిలారోహణాదిశిక్షలు బంధమనగాకర్మము- మోక్షమనగా సత్యలోకమైన యాకాశమందు బ్రవేశించిమెల్లపైడు నదిమొదలుగనూర్ధ్వముగాబోవుచుండుటవీటినే మఱియొకవిధముగా నైదు భేదములని చెప్పుచున్నారు - జీవాస్తికాయము - పుద్గలాస్తి

కాయము - ధర్మాస్తికాయము - అధర్మాస్తికాయము- ఆకాశాస్తికాయము అని ౫ విధములు అస్తికాయమనగాపదార్థము-జీవుడనుపదార్థము - నిత్యసిద్ధుడు- ముక్తుడు - బద్ధుడు - అని 3 విధములు - పుద్గలాస్తికాయము పృథివ్యప్తేజోవాయువులు, స్థావరము, జంగమముఅని ౬ విధములు - మంచినడతవల్లననుమించదగినది - ధర్మాస్తికాయము - దేహసంబంధమువల్లననుమింపదగినదియధర్మాస్తికాయము- ఆకాశాస్తికాయమనునది, సాంసారిక లోకాకాశమనియు, ముక్త్యాశ్రయమగు నాలోకాకాశమనియు ౨ విధములు- బంధమనుకర్మము ౮విధములు- అందుఘాతుకకర్మములు ౪ విధములు- తత్వజ్ఞానమువల్ల ముక్తిలేదని నిశ్చయించుట మొదటిది- అర్హతతంత్రశ్రవణమువల్లముక్తిలేదనినిశ్చయించుట-౨ ది. పెద్దలవలన జెప్పబడిన మోక్షమార్గములయందు నేమివిశేషమనితిరస్కరించుట మోహనీయమనుమూడవది మోక్షమార్గమునకువిఘ్నమును జేయునదిరది- వీనికిఘాతుకములని పేరు.

తత్వమున్నదనితలచుట వేదనీయమనుకర్మము - తనపేరునుదెలుసుకొనుటనామకమను ౨ వకర్మము- నేనుఇచ్చటనీకుశిష్యకోటిలోజేరినవాడనని గురువునొద్దజెప్పుకొనుట - గోత్రకమను 3 కర్మముశరీరస్థిత్యర్థము గావ్యాపరించు తక్కినకర్మములన్నియు ౪ కర్మము- యీ ౪ కి అఘాతుకమనిపేరు- ఈఘాతుకాఘాతుకములకు బంధమనిపేరు - వీనికినింకాయనేక అవాంతరభేదములను జెప్పుచున్నారు- అన్నిపదార్థముల యందును, సప్తభంగనయమను నొకన్యాయావతారమును జెప్పుచున్నారు అదేదియనగా, స్యాదస్తి అనగా నున్నదనియొప్పుకొనవలయును - స్యాన్నాస్తి - అనగా లేదనియొప్పుకొనవలయును - స్యాదస్తిచనాస్తిచ- ఉన్నదని లేదని యొప్పుకొనవలయును - స్యాదవక్తవ్యం- స్యాత్ అనిచెప్పగూడదు - స్యాదస్తిచావక్తవ్యం - స్యాదస్తి

యనిచెప్పగూడదు- స్యాన్నాస్తిచావక్తవ్యం- స్యాన్నాస్తిఅనిచెప్పగూడదు - స్యాదస్తిచనాస్తిచావక్తవ్యం-స్యాదస్తిచనాస్తిచఅనిచెప్పగూడదు- అనియీయేడును సప్తభంగనయములని చెప్పబడుచున్నవి - వీటి యోజన క్రమమేమంటే.

ఒకఘటమున్నదనిచెప్పితే, సర్వాత్మనాయున్నదని చెప్పగూడదు- యెందువల్లనంటే, ఘటముకులాలునియింటిలోనుండి, మనకుప్రాప్తముకానప్పుడు సర్వాత్మనా యున్నదనియంటే, ప్రాప్తమైకూడనున్నదనియర్థమగుచున్నదిగనుక, ప్రాప్త్యపేక్ష లేకపోవలసివచ్చును-కాబట్టిస్యాదస్తియనిచెప్పవలెను - అనగా, కథంచిత్ ఉన్నదనిభావము.

తనకు అదిలేదనియిచ్ఛగలిగినప్పుడు కులాలునియింట్లోనున్నదిగనుక, సర్వాత్మనాలేదని చెప్పుటకువల్ల పడదు కాబట్టి,స్యాన్నాస్తి అనిచెప్పవలయును అనగాకథంచిత్ లేదనిభావము.

ముందున్నదని యిచ్ఛగలిగి, వెనుకలేదనియిచ్ఛగలిగినపుడు, పైజెప్పినరీతిగా, స్యాదస్తిచనాస్తిచ అనిచెప్పవలెను.

ఒకకాలమందే యీరెండుఇచ్ఛలుగలిగినంతట అస్తినాస్తియను ౨ శబ్దములను ఏకదాచెప్పుటకువల్లపడదుగనుక, స్యాదవక్తవ్యం అనిచతుర్థాంగము ప్రవర్తించుచున్నది.

యిదేప్రకారము తక్కినమూడు భంగులు ప్రవర్తించుచున్నవని చెప్పుచున్నారు.

అనియీసప్తభంగన్యాయము సర్వపదార్థములయందు ప్రవర్తించు చున్నదిగనుక, సర్వ పదార్థములు యస్తిత్వ నాస్తిత్వాది అనేకరూపములతో జేరినవేకాని, యేకరూపమైన వస్తువు ఒక్కటియులేదు కాబట్టియేకరూపమైనబ్రహ్మమును ఒప్పుకొనుట సరిగాదని జైనులు చెప్పుచున్నారు.

ఉత్తరము.

అదిసరిగాదు - ఎందువల్లనంటే ఘటాదివస్తువులయందు గూడనేకకాలమందు సదసత్త్వాదివిరుద్ధ ధర్మసమావేశము సంభవింపదుగనుక యీసప్తభంగనయము, ఏపదార్థమందైనను, ఎట్లుసంభవించును - ఈసప్తభంగన్యాయమునకుసంశయములవలన బ్రవృత్తిగలుగుచున్నదనియంటే, నీకుసర్వపదార్థములు సంశయగ్రస్తములై పోవుటవలన నొకపదార్థమును నిశ్చయముగా సిద్ధింపదు - అట్లుసిద్ధింపకుండగా నిన్ని పదార్థములని నీవెట్లుచెప్పవచ్చును - నిర్ధారణలేక శిష్యునికి గురువుపదేశించుటగాని యెట్లుసంభవించును - స్యాదస్తి చావక్తవ్యమనునయము ప్రవృత్తించియుండునపుడు - ఎవరుదేన్ని యెట్లుచెప్పవచ్చునుగనుక, యీ యార్హతమతముసరిగాదు.

ఈమతమందును క్షణికములగు బదార్థములే, యొప్పుకొనబడుచున్నవిగనుక, క్షణికపదార్థవాదమందు సుగతమతఖండనమందు జెప్పబడినదోషములన్నియు వీటియందును బ్రసక్తించుచున్నవి.

ఇదిగాక, యీ యార్హతుడు శరీరసమపరిమాణునిగా జీవుని నొప్పుకొనుచున్నాడు - అదిసరిగాదు - ఎందువలననంటే, ఒకమనుష్యుడుగానుండిన జీవుడు కర్మవశముచేత, నేనుగుగాగాని, గుఱ్ఱముగాగాని, పుట్టునపుడు మనుష్యశరీరపరిమితుడైనవాడు - ఏనుగు మొదలగువాని శరీరపరిమాణుడుగ నెట్లగును.

ఇట్లుబాల్యశరీరము నందుండిన జీవుడు ఆబాల్యశరీరపరిమితుడై యుండియుండవలయునుగనుక, యాశరీరము యౌవనాదికాలములలో,వృద్ధిపొందినప్పుడు, ఆశరీరపరిమితుడుగా, నెట్లగును- జీవునికిని అవయవములను అంగీకరించి యవయవముల యొక్క యుపచయాపచయములవలన, వృద్ధిహ్రాసములుగలుగుచున్నవనియంటే , శరీరా

దులవలెనే జీవునికిని, అనిత్యత్వము వచ్చుచున్నదిగనుక బంధమోక్ష వ్యవహారములులేక పోవలసివచ్చును, జీవాత్మకునప్పుడప్పుడు గలుగు తత్తచ్ఛరీరపరిమాణములుగా, జీవపరిమాణమును నేర్పడుచున్నది.

ఇవియావత్తు అనిత్యములేను - మోక్షకాలమందు జీవాత్మలకు నేపరిమాణముగలుగుచున్నదో, అదిమాత్రము వెనుక నశింపదనిచెప్ప టయుసరిగాదు - ఎందువలననంటే, జీవాత్మయను వస్తువునకు అప్పుడప్పుడు పరిమాణభేదము గలుగుచున్నప్పుడు పూర్వము గలిగిన పరిమాణములు మాత్రమునశించిపోతే, యేతజ్జాతీయమైన వెనుకటి పరిమాణము మాత్రమేలనశింపకపోను.

మఱియుసప్తభంగన్యాయముచేత, నేవస్తువునునిశ్చయించుట కునలవికాకున్నను, వ్యవహారయోగ్యములైన యీసర్వపదార్థము లెట్లుసృజింపబడినవాయెను- పరమాణుసంఘాతముచేత గలిగినవనిచెప్పుదురు, అల్లైనను, గర్తలేకయే, తనంతట, ఘటపటాద్యాకారము గాబరమాణువు లెట్లుచేరును.

మఱియు, ఆత్మనిర్గుణమని చెప్పుచున్నారు, అట్టినిర్గుణమైనజీవునికి, ఘాతుకకర్మముచేత, నెట్లుమోక్ష ప్రతిబంధకముగలుగును, జీవునికేఘాతుక కర్మముకలదంటే, యాజీవుడు నిర్గుణమెట్లగును-మంచిది జీవునికి ఘాతుకకర్మము మోక్షప్రతిబంధకమని యెవరిచేత నేర్పడియెను- అట్లేర్పడనియెడల, జినుడుఉపదేశక గురువెట్లాయెనుగాబట్టిసర్వ పదార్థసృష్టికిని, దత్పాలనకును, జీవులకుసదసత్కార్యానుగుణము లైన బంధమోక్షాదుల నిచ్చుటకును, సర్వశక్తిగల యీశ్వరునినంగీక రింపకవిధిలేదు.

మఱియు, మలధారణ, హింసానివృత్తి, దిగంబరత్వ, విషయవైరాగ్య, పాణిపాత్రభోజన, కేశోల్లుంచన, వాఙ్నియమనాదికర్మం

బులును దేహాతిరిక్తాత్మ జ్ఞానంబునను సాధనంబులవలన ప్రకృతిసంబంధ నివృత్తిపూర్వకముగా మోక్షమునుగలుగునుఅది, జీవునికిబంధమువీడగానే, యనంతోన్నతగతిగా నూర్ధ్వముగా బోవుచునుండుటయే, యని, చెప్పుచున్నారు, ఈయనంతోన్నతగతిగా బోవుటయనునది, జీవధర్మమంటే, నిర్గుణుడైనజీవునికీ ధర్మమెట్లుగలుగును- స్వభావమంటే, స్వభావముజడమాట చేతనున్నతగతి యెట్లుగలిగించును- ఈశ్వరనిర్ణయమంటే, మీమతమందు నీశ్వరుడేలేడు - ఇందువల్ల నుపదేశకునికి శిష్యునికి బోధకురాని యంధ పరంపరాప్రాప్తమైన, యవ్యక్త ప్రలాపములుగా నున్నవి- ఇందువలననొక గొప్పయున్నతమైన మేడయెక్కుటవలన గల్గుసంతోషమును బట్టి యున్నతగతి మోక్షమని నిర్ణయించియుందురు.

కాబట్టి, సర్వశక్తిగల యీశ్వరుడు జగత్కర్తకాడనియు, బరమాణు సంఘాతమువల్ల జగత్తుకలుగుచున్నదనియు , నొకనిర్గుణమైన జీవాత్మకలదనియు, గొన్నిహేతువులవలన బంధనివృత్తిగలిగి, యనంతోన్నతగతిగా ఆజీవాత్మ పైకిబోవుచునుండుటే, మోక్షమనియుజెప్పు నీజైనమతము సరిగాదనిబుద్ధిమంతులు యోచింపగలరు.

—(*) సాంఖ్యమతఖండనము. (*)—

సత్వరజస్తమస్సులనుగుణములు సమావస్థగలవై ప్రధానమని చెప్పబడుచున్నవి- పురుషుడుఅనగా జీవుడుశుద్ధ ప్రకాశస్వరూపుడు- ఈప్రధానపురుష లను రెండేపదార్థములను సాంఖ్యులుఒప్పుకొనుచున్నారు- ప్రధానములో సత్వరజస్తమస్సులకుపరస్పరవైషమ్యము కలిగినప్పుడు, మహదహంకారాదులున్ను, వాటివలనబంచభూతాదులును, గలిగివాటివలన బాంచభౌతికమగు శరీరము కలుగుచున్నదనియు, వాటివలనలోకవ్యవహారము కలుగుచున్నదనియు శరీరములోనుండు నంతఃకరణమును, బురుషసాన్నిధ్యమువలన , జ్ఞానసుఖదు

ఖాదులు గలుగుచున్నవనియు, నాయంతఃకరణసాన్నిధ్యమే పురుష నికిబంధమనియు, నంతఃకరణసంబంధము లేకపోవుటయే, మోక్షమని యు జెప్పుచున్నారు.

మఱియును మృదాదులులేక ఘటాదికార్యములు గలుగవుగ నుకనున్ను, మృదాదులవలన జేయబడినఘటాదులు మృదాదిస్వరూపము గానే, యుండుటవలననున్ను, యీదృష్టాంతముచే సుఖదుఃఖ మోహాత్మకమగు నీప్రపంచమునకు, సుఖదుఃఖమోహాత్మకమగు, సత్వరజస్తమోమయమైన ప్రధానము కారణమనియూహించుచున్నారు- మృత్సంయోగాదులవలనఘటాదులు గలుగుచున్నవిగనుక నీదృష్టాంతముచేఁ బరస్పరసంయుక్తములగు సత్వరజస్తమోమయమైన ప్రధానమునకేజగత్కారణత్వ మొప్పవలయుననియు,నసంయుక్తమగుబ్రహ్మమును నంగీకరించుటయు నావశ్యకమనియు, జెప్పుచున్నారు.

ఉత్తరము,

అదిసరిగాదు మృదాదులవలన ఘటాదులు కలుగుచున్నవను దృష్టాంతమునుబట్టి ప్రధానమునంగీకరించు నప్పుడు ఆమృదాదులుకు లాలాదికర్తృసాపేక్షమయ్యే, ఘటాదులను గలుగజేయుట, యనుభవసిద్ధమైయుండగా, నీప్రధానము గూడ జేతనకర్తృసాపేక్షమైయే, జగత్కారణమగుచున్నదనిచెప్పక పోవుటకు గారణములేదు ఈప్రపంచరూపమైన చిత్రవిచిత్రరచన, సర్వజ్ఞుడై సర్వశక్తుడగునీశ్వరుని మోచనలేక గలుగనేరదు - రథాద్యచేతనములు, సారథిమొదలగువారిచే బ్రేరేపింపబడియే, వ్యాపారములయందు బ్రవర్తించుచున్నవి. అట్లుగుణసామ్యావస్థను బొందినప్రధానము- ఒక,నియంతలేకపోతే, గుణవైషమ్యమునుబొంది, మహదాదిరూపముగ బరిణమించుటకు, నెట్లుప్రవర్తించును ఉదకముఒక,నియంతలేకనే స్రవించుటకుబ్రవర్తించు

నట్లు, ప్రధానము మహదాదిరూపముగ, బరిణమించుటకు బ్రవర్తించుచున్నదనియంటే, అవి, యచేతనములుగనుక యీశ్వరుని, నియమనమువలననే ప్రవర్తించుచున్నదని చెప్పవలసి యుండగా వాటినిదృష్టాంతముగాజూపుట, సరిగాదు- ప్రవర్తించుట ప్రధానమునకు, స్వభావమనియంటే నివర్తింపజేచు వాడొకడు లేడుగనుక యెల్లప్పుడును, మహదాది రూపముగానే, ప్రవర్తించుచునే, యుండవలసివచ్చును- అట్లుచెప్పుట, ప్రళయము నంగీకరించు నీసిద్ధాంతమునకు విరోధమగును- గనుక, నియంతగా, నీశ్వరు నొప్పుకొనవలయును- తృణాదులోక, నియంత లేకయే, క్షీరాదిరూపముగా బరిణమించునట్లు, ప్రధానమును బ్రవర్తించుచున్నదనియంటె అదిసరిగాదు- తృణములుగోవుచేతభుక్తమైతేనే, క్షీరముగా బరిణమించుచున్నదిగాని, వృషభాదులచే భుక్తమైనా, లేక, యూరకేయుండినా, యీలాగు పరిణమింపవుగనుక అది దృష్టాంతముకానేరదు- ఒకపంగువైనపురుషుడు అంధుడైనపురుషుని మీదనెక్కుకొని, యతనినడుచునట్లు దారిచూపించుమాదిరిగానున్నా, అయస్కాంతము అయస్సును ఆకర్షించు మాదిరిగానున్నా, బురుషుని సాన్నిధ్యమువలన బ్రధానము ప్రవర్తించుచున్నదని చెప్పెదమంటే, పంగువు, దర్శనసామర్థ్యము గలిగిమార్గము చూపుచున్నాడు గనుకఅంధుడు నడుచుటకు బ్రవర్తించుచున్నాడు- నీవలన నొప్పుకొనబడిన పురుషుడనుజీవుడు, నిర్గుణుండై నిష్క్రియుండై యుదాసీనుడై యీలాగు ప్రవర్తింప జేయజాలడు- గనుకమొదటిది దృష్టాంతముగానేరదు- అయస్కాంతముసాన్నిధ్యమాత్రమువలననే, యయస్సునుబ్రవర్తింపజేయునట్లు నిర్గుణుండై, నిష్క్రియుండైన జీవుడు ప్రధానమును బ్రవర్తింప జేయునెడల, నీపురుషునిసాన్నిధ్యము ప్రధానమునకు నెల్లప్పుడుగలిగి యున్నదిగనుక, యెల్లప్పుడును ప్రధానము మహదాద్యా

కారముగా, బరిణమించుచునే యుండవలసివచ్చును - అలాగుచెప్పు
ట నీసిద్ధాంతమునకును విరోధమైయే యున్నది.

ఇదియునుంగాక, ప్రధానములో సత్వరజస్తమస్సులు సమాన
ములై యున్నందున, నొకటియంగియనియు, దక్కినవియంగము లని
యుజెప్పుటకు, వలనులేదు- గనుక, యంగ్యనుసారముగా నంగములు
ప్రవర్తించుచున్నవని చెప్పుటకునుసరిపడదు- కాబట్టిపై వివరించినరీ
తిగాబ్రత్యక్షానుమాన ప్రమాణములచేత జగత్కర్తయైన యీశ్వరు
నినొప్పకవిధిలేదు కాబట్టిజగత్కర్తయైన యీశ్వరుని నంగీకరింపక, ని
ర్గుణమైనపురుషునినాప్రకృతినిన్ని అంగీకరించుసాంఖ్యమతముసరిగాదు.

సేశ్వరసాంఖ్యులు ఈశ్వరుడు కలడందురుగాని, యీశ్వరునికి
జ్ఞానేచ్ఛాక్రియాది స్వతంత్రశక్తులను ఒప్పుకొనమిచే, వారిమతమునుని
రీశ్వరమతతుల్యమే యగుచున్నది.

## (*) శాంకరాద్వైతమతఖండనము. (*)

నిర్విశేష చిన్మాత్రంబగునిర్గుణ బ్రహ్మం బొక్కటియె పరమా
ర్థము- తదతిరిక్తంబులగు, జ్ఞాతృజ్ఞేయజ్ఞాన భేదంబులుకల్ల- నిర్విశే
షమనగా విశేషములులేనిది విశేషములనగా, సజాతీయ విజాతీయ స్వ
గతభేదంబులని మూడువిధంబులు- సజాతీయ భేదములనగా, నొకజా
తిదైనఘటాది వస్తువులలో, నొకదానితో నొకదానికిగలభేదము- చి
త్తులనంబడుజీవులెల్ల బ్రహ్మంబుకంటె వేఱుగాదు- గాననట్టిచిద్బ్రహ్మ
భేదంబులేదు- అచిత్తనంబడు నవిద్యయనునొక్క విజాతీయవస్తువు గ
లదు- అదిమిధ్యాభూతంబు తత్సంపర్కంబు వలననే, బ్రహ్మంబున
కుజీవంబుగలిగె- నదియనాదియై, యావరణవిక్షేప శక్తులనురెంటిచే
జీవులకు స్వస్వరూపంబుగా, గానరాకుండ, నానావిధభేద భ్రాం
తులంగలిగింపుచున్నది- అట్లుండియు, నదిమిథ్యాభూతంబుగాన, నచి

త్తుబ్రహ్మ భేదంబనువిజాతీయ భేదంబునుగల్గదు- సచ్చిదానందఘనస్వరూపంబగు బ్రహ్మమునకు స్వరూపమొకంటెవేఱుగా, సత్యజ్ఞానానందాది గుణములులేవుగాన, స్వగతధర్మ భేదంబునులేదు- అట్టియవిద్యచేత, భ్రమింపుచుండుటయే జీవునకుసంసారము.

తత్త్వమసీత్యాది వాక్యజన్యజ్ఞానంబున, నవిద్యనివర్తిల్లుటయె, మోక్షమని చెప్పుచున్నాడు.

ఉత్తరము.

ఇదియు నాస్తికమతమేను- ఎట్లనగాసజాతీయ విజాతీయ స్వగత భేదములుగలుగక,నిర్గుణబ్రహ్మము జగత్కారణ మెట్లగును- జగత్తేమిథ్యగా నుండునపుడు దీనికికర్తయేల- జగత్తు మిథ్యయయ్యేనేని, యర్థక్రియాకారి కాకపోవలసివచ్చును.

మరియును- ఆబ్రహ్మము మాయోపాధిచేతనీశ్వరుడై, సర్వజ్ఞత్వసర్వశక్తిత్వవిశిష్టు డగుచున్నాడనియు, నాబ్రహ్మమునకే , యవిద్యోపాధిచేత జీవుడై , కించిజ్ఞుడై యల్పశక్తిమంతు డగుచున్నాడనియు, నట్టియీశ్వరుడు ప్రకృతిజీవులను మిశ్రితముశేసి , సమస్తప్రపంచమును జేయుచున్నాడనియు, జీవుడు సదసత్కార్యములు సేయుటవలన, స్వర్గనరకము లనుభవించి, పరిశిష్టకర్మ ఫలానుభవమునకై, నీచోచ్చజన్మము లెత్తుచున్నా డనియు, వారే చెప్పుచున్నారు- దబ్బరమైనమాయావిద్యలను నుపాధులచేత శుద్ధనిర్గుణబ్రహ్మమునకు నీశ్వరత్వ జీవత్వాదులెట్లుగలిగి గుణవిశిష్టులెట్లైరి - ఇంతబలము ప్రకృతికినుండునపుడు- అదిబ్రహ్మముకంటె బలముగలదైనది- యిట్లుండగాబ్రకృతి యనుపదార్థము దబ్బరయని యెట్లుచెప్పనగును- అయితేయిది వాస్తవముగాదు- భ్రమవలనగలిగినదని చెప్పుచున్నారు- ఆభ్రమగల్గుటకు, భ్రమాధారశక్తియు, భ్రమించువాడును బూర్వము చూడబడు రజ

తము నీనూమనుండకే, భ్రిమయెట్లుగలుగును- రెండవపదార్థము లే
కపోయెను- బ్రహ్మముసిర్గుణమాయెను భ్రిమాధారమేది, భ్రిమించు
వాడెవడు - శుద్ధనిర్గుణమైన బ్రహ్మమునకు, భ్రిమగాని యుపాధిగా
నిచెప్పుట, యుక్తిక్షమము గాదని, యద్వైతులగు విద్యారణ్యస్వా
ములవారు శుద్ధబ్రహ్మము అంతఃకరణములో బ్రతిబింబించి నందు
న, నాప్రతిబింబమునకే, యజ్ఞానముగలిగి, తానుఅహంకార మమకా
రాదులచేత గర్మములజేయుటచే గర్మఫల రూపములైన, స్వర్గనర
కాదు, లనుభవించి, నీచోచ్ఛజన్మాదులెత్తి, సుఖదుఃఖ, భోక్తయగు
చున్నాడనియు, బ్రహ్మద్వితీయ జ్ఞానముచేతగర్తృత్వాదులు వదలినం
దున, నంతఃకరణమునశించి సుఖదుఃఖభోక్తయైన బ్రతిబింబములేకపో
వుటయే, మోక్షమనియు,వ్రాసిరి- ఇదిమతియు నసంగతము- ఎట్లన
గానిర్గుణమై- యేవిధ రూపములేనిబ్రహ్మము, మిథ్య(అబద్ధము) యై
నయంతఃకరణమందు నెట్లు ప్రతిబింబించును- బింబించెబో, యాప్రతి
బింబము అవస్తువుగదాయది, కర్తృత్వాదులుగల్గి, కర్మములు చేసి
సుఖదుఃఖాదు లనుభవించు టెట్లు, బ్రహ్మముకానిదానికి, బ్రహ్మద్వితీ
యజ్ఞానము గలుగుటెట్లు బ్రహ్మద్వితీయ జ్ఞానమనగా, నేతినేతివాక్య
ములచేతన తన్నిరసనముచేసి, శేషించినదితాను బ్రహ్మమనుకొనుట,
యిట్లుఏకాంతముగా సమాధిసేయుచునుండగా నిద్రాప్రారంభము వ
లెనొకయానందా విర్భావముగలుగుచున్నది- అదేస్వస్వరూపానంద
మనియు బ్రహ్మానందమనియు జెప్పుచున్నారు- ఈయానందముబ్రహ్మా
నందమగు నట్లైతేయింతకునతిశయమై నరతియందలి స్ఖలనానందమును,
మాదకవస్తు సేవానందము నివియే, పరబ్రహ్మా నందము లనంబడును
యింతకన్నపిచ్చి మాటేమియున్నది యిక్కడ దహించితే పోవునట్టిశ
రీరములో గలుగునానందము, బ్రహ్మానందమెట్లగును ఇదేమోక్షానం

దమైతేశరీర ముండగానే మోక్షము గలుగవలసివచ్చును - అయితేయి దేజీవన్ముక్తియని యొకమొండిమాట చెప్పుదురు ఇదిముక్తియైతే, క్షుత్పిపాసామోహాది ప్రకృతిగుణములు వానికెట్లుగలుగును, కలుగుపక్షములో ముక్తికిబునరావృత్తిచెప్పవలసివచ్చును - ఇదియెంతయసంగతమో యోచించుడు- అట్లుబ్రహ్మాద్వితీయ జ్ఞానముకలిగెబో- తనకుగలిగిన సుఖదుఃఖ ములు నశింపజేసికొనుటవలన, దనకేహాని- అయితేబింబాధారమైన బ్రహ్మమునకు మోక్షసుఖము గలుగుచున్నదని చెప్పుచున్నారు- చేసిన వాడొకడుఫలము ననుభవించిన వాడొకడనిచెప్పెడు లోకసామితెయగును.

మంచిది ప్రతిబింబించు నిర్గుణబ్రహ్మమునకు నంతఃకరణమందలి ప్రతిబింబించుటచే, దనకెట్లు బంధముగలిగె- నెట్లుదుఃఖముగలిగె- ఇప్పుడు ఏమిపోయి సుఖముకలిగె- మంచిదినిర్గుణమైన యొకశూన్యవస్తువునకు మోక్షానంద మెక్కడవచ్చును- ఇందువలన బ్రపంచమునకు- నే యుపయోగమును లేని, నిర్విశేషనిర్గుణచిన్మాత్రబ్రహ్మమున్నదనిచెప్పుటయు లేనిప్రాయమే యయ్యెగాబట్టి శంకర విద్యారణ్యాద్వైత మతములుసరిగావు.—

(*) మీమాంసకమతఖండనము. (*)

వ్యాసులవారు, "అథాతోబ్రహ్మజిజ్ఞాసా" యని యారంభించి బ్రహ్మసూత్రములనుజేసెను- వ్యాసశిష్యుడైనజైమినిఋషి, "అథాతో ధర్మజిజ్ఞాసా"యనియారంభించి, కర్మబ్రహ్మవాద సూత్రములనుజేసెను- ఇదియెంత యాశ్చర్యమో చూడుండు- ఇన్నింటికి నంగడి సంస్కృతభాషతోనుండు వేదము.

కర్మబ్రహ్మ సూత్రార్థకర్తలగు మీమాంసకులు , వేదములు, విధిమంత్రార్థ వాదములను,3 విధములనియు, వానిలో విధివాక్యములే

ప్రమాణములనియు,మంత్రములనుష్ఠేయార్థప్రకాశకములనియు,నర్థవా
దములువిధివాక్య ప్రోక్తములనుబ్రశంసించుటకు గా, లేనికథలను జెప్పుచు
న్నవనియు, నాత్మనుపాసింపవలయునని, విధివాక్యముచేవిధింపబడిన
యుపాసనమును బ్రశంసించుటకు గానుపనిషత్తులన్నియుబ్రవర్తించినవిగ
నుక,నుపనిషత్తులుప్రమాణములుకావనియు,నందువలన, నుపనిషత్ప్రతి
పాద్యమగుబ్రహ్మమునొప్పుకొనబనిలేదనియు, విధివాక్యములచేతనుద్దే
శింపబడినఫలములననుభవించుటకుగా, దేహవిలక్షణులైనిత్యులగుజీవుల
నుమాత్రమంగీకరింపవలయుననియు,విధివాక్యవిహితమగుజ్యోతిష్టోమా
దియాగములు,అపూర్వమనుపదార్థమునుగలుగజేయుచున్నవనియు,నా
యపూర్వము- స్వర్గాదిఫలములనిచ్చుచున్నదనియు, నీశ్వరునినొప్పువా
రందఱును, నదృష్టానుసారముగానే, యీశ్వరుడుఫలప్రదాతయగుచు
న్నాడని,యీయపూర్వమునొప్పుచున్నారుగనుక,యపూర్వమేఫలప్రద
మగుచున్నదనియొప్పుటవలననే, యిష్టసిద్ధిగలుగుచుండగా,ననుమానము
వలననైన,నీశ్వరునొప్పుటసరిగాదనియు,ఆత్మలకు, ననాదికాలంబునుం
డియుం, జేయంబడు పుణ్యాపాపకర్మ ప్రవాహంబున, సంసారమ
నాదిగానున్నది- ఒక్కకాలంబునసృష్టియు నొక్కకాలంబున బ్రళ
యంబును గలుగునన్నదిలేదు- కర్మములో నిషిద్ధకర్మంబులు సేయు
వారువానిప్రాబల్య తారతమ్యంబున, క్రిమికీటాది జన్మంబులుననరక
లోకంబులుంజెందుచుందురు-కామ్యకర్మంబులంజేయువారువెండియుం
బుట్టుచుందురు- వేదవిహితంబులగు యజ్ఞాదికర్మంబులు ఫలాభిసంధి
తోజేయువారు- ఆయాస్వర్గాది ఫలంబులు సెందుదురు- ఫలాభిసంధివి
డిచిచేయుచోవానివలన బుట్టినయపూర్వంబే కర్మసంబంధనివృత్తిపూ
ర్వకంబగు కేవలాత్మప్రాప్తియనెడు మోక్షముంగలిగించును అప్పుడు
నిత్యసుఖాభివ్యక్తియగును, ఇంతియగాని , చతుర్థ్యంతవినియోగంబె

దేవతయని వ్యవహరింప బడుగాని, ఫలమునిచ్చు దేవతయే లేదు, అని యీమతస్థులైన భాట్టులుప్రాభాకరులు చెప్పుచున్నారు.—

ఉత్తరము.

అచేతనమగు, నపూర్వమెట్లు ఫలప్రదమగును, ఫలప్రదాత లేకఫలముగలుగుట, లోకములో నెచ్చట ననుభవింపబడలేదు- గనుక యొక ఫలప్రదాతనవశ్య మంగీకరింపవలయును- ఎట్లనగా జోరాదుల చేజేయబడు కార్యములకురాజులేక శిక్షజరుగునా?

మఱియు ననేకములగు యాగాది సత్కర్మములకును, గళంజ భక్షణాది నిషిద్ధకర్మములకు నాయాఫలముల నిచ్చుటకుగా నీశ్వరునికి సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులు అవశ్యముగ నంగీకరింపవలయును.—

మఱియును దేహవిలక్షణులై నిత్యులగు జీవులనుమాత్ర మంగీకరింపవలయుననియు, విధివాక్య విహితములగు జ్యోతిష్టోమాది యాగములుఅపూర్వమను పదార్థమును గలుగజేయు చున్నవనియు, నాయపూర్వము స్వర్గాదిఫలముల నిచ్చుచున్నదనియు జెప్పుచున్నారు.—

దేహవిలక్షణుడైన జీవునినొప్పుటకు, మృతిబొందినపిదప, వృద్ధ్యాది కార్యములు గలుగవుగనుక, దేహవిలక్షణ జీవుని నంగీకరింపవచ్చునుగాని చేతనా చేతన మిశ్రితములుగ మనుష్య పశుపక్షి పాషాణాదిరూపము, లెవరివలన గలుగజేయబడెను- ఇదివానివానికర్మము వలన గలుగునపూర్వమే, గలుగజేయు చున్నదంటే, యపూర్వమను నది- శిక్షారక్షాదులకు హేతుభూతమైన యొకయేర్పాటుగా నున్నదిగాని, ఆయేర్పాటె ఫలమునెట్లుపుట్టించును- మంచిది యజ్ఞయాగాదులకు స్వర్గస్వారాజ్యాదు లనుభవించుట, ఫలమని, యెవరేర్పఱచిరి- అట్లువేదమే యేర్పఱచెనంటే, వేదము శబ్దరూపమాయెనే, యాశబ్దముస్వతః యెట్లుగలిగెను- వేదములు చటములవంటివి - ఆచట్టము

లుఒకరుచేయక, తనంతటగలిగినవని యెవరైనను జెప్పగలరా, మంచిని ఆచట్టములుండెబో, యాచట్టముల ప్రకారముగ, శుభాశుభకర్మములు జరిపించువారిని శిక్షించువారులేకయే, యాచట్టములప్రకారముగ శుభాశుభఫలములు గలుగజేయుటకు, నాయాకర్మవలన గలిగి, యచేతనమగు నపూర్వముశిక్షించునా, లేకకర్మమువలననపూర్వముపుట్టుచున్నది, అదిసుఖదుఃఖాది ఫలముల బుట్టించుచున్నదని చెప్పనెడల, జరామరణాదులు రాకుండ, గర్మముచేసి, యెవరేనియట్టిఫలముల బొందియున్నారా, అన్నపాకాదులుచేసిన, యాకర్మమాత్రముచేతనే మనుష్యులుభుజింపకే, క్షుత్తుతీరునా, యిక్కడయజ్ఞములోహోమము చేయుపదార్థములు, యిక్కడనే దహనమై పోయెను- ఈహింసాది దహన కర్మములు అపూర్వమును బుట్టించుటెట్లు. స్వర్గాదుల ననుభవింప జేయుటెట్లు, అట్లుఅనుభవించిన వారికెవరికేని, జ్ఞాపకమున్నదా- పశువునుజంపి యజ్ఞముచేసితే, యాపశు వునకును జేసినవారికిని, స్వర్గమని చెప్పబడియున్నదే, తండ్రినిజంపియజ్ఞముచేసితే, తనకును దండ్రికిని స్వర్గముగలుగుచున్నదియింతకంటె బుద్ధిహీనత్వము]
డేమి మేలుచేయగలడు.

ఇంతేగాక యాస్తికులైన మేము ఈశ్వరకృత ప్రపంచములోనుండు, సుఖదుఃఖాద్యను భవములుగలుగజేయు, మానసేంద్రియము గలజీవకోట్లకు, సుఖమును గలుగ జేయుటవలన, జీవతృప్తి ద్వారముగానందజీకి దండ్రియైనయీశ్వరుడు ప్రీతుడైమంచిని గలుగజేయు చున్నాడనియు, నట్టిమానసేంద్రియముగల జీవకోట్లకు, దుఃఖమునుగలుగజేయుటవలన, వాటికిగలుగుశ్రమనుబట్టి తండ్రియైనదేవుడు శిక్షించుచున్నాడని, లోకానుభవమునబట్టి చెప్పుచున్నాము- ఈయజ్ఞముల ననవి- జీవ హింసాకరములుగాను, ననేకపదార్థములను వ్యర్థము

గానగ్నిలోవేసి భస్మముసేయునవిగా నుండుయజ్ఞాది కర్మములు ఈశ్వరప్రీతి గలుగజేయునవిగావు.—

ఇందువలననీలాటి నాస్తికమతములు సరిగావు- అయితే యీశ్వరుడున్నాడని చెప్పుమతములు గలవారైనను బ్రహ్మము ప్రత్యక్షసిద్ధము కాని హేతువుచేతను, వీడుచేయు దుష్కర్మములకు దత్కాలములో శిక్షగలుగజేయని హేతువుచేతను ఈశ్వరునియందు దృఢవిశ్వాసములేక హింసచేయుట, యనృతమాడుట, తనయుత్పత్తికి గారకులగుదల్లిదండ్రులను శ్రమపఱచుట, అన్నదాత విద్యాదాతలకు ద్రోహముచేయుట, యెదటివారికి దుఃఖముగలుగునట్లు పరస్త్రీ పరధనాదులుగ్రహించుట, చౌర్యాదులు చేయుట, లంచములుతీయుట, న్యాయము నన్యాయముగాజేయుట, యీలాటిపనులు చేయువారు పెద్ద నాస్తికులని చెప్పబడుచున్నారు.—

నాస్తికులుశిక్షించు నీశ్వరుడులేడనియెంచి దుష్కార్యములుచేయువారు- వారిదియజ్ఞానము.

ఈశ్వరు డున్నాడనిచెప్పుచు, నెగువవ్రాసిన చెడ్డపనులు చేయువారు, జ్ఞాత్వానుష్ఠానముగలవారు- ఇందువలన నీశ్వరునియందు విశేషముగ తప్పితముచేసిన వారగుచున్నారు- కాబట్టి పెద్దనాస్తికులని వారిని జెప్పవలయును.

(*) గ్రంథముయొక్కయుపసంహారము. (*)

ఈయాస్తికనాస్తికవాదము బహుకాలము నుండి జరుగుచునేయున్నది - ఏలనంటే, దేవుడు తనతత్త్వముల నొకరితోజెప్పెననుటగాని, యాతత్త్వములను దెలుపువేదములనంబడు పుస్తకములను ఆయనచెప్పెననుటగాని, దేవుడుపంపెననుటగాని, లేకహిందువులు చెప్పుప్రకారముగ, దేవునివలెనే, వేదముఅనాది యనుటగాని,యీలాటి

మాటలభిమాన పూర్వకములు ఆయావేదము, లాయామతస్థుల యొక్క పూర్వీకులచేత జెప్పబడినవేను- ఈవివరము మనస్వాత్మ్యగ్రంథము లోనున్నది చూచుకొనవచ్చును.

మఱియు దేవుని తత్వములను జూచివచ్చిన వారుగాని, యిక్కడినుండియే, జ్ఞానదృష్టిచేత దెలిసికొన్న వారుగాని లేరు.

ఇందులో నొక్కటియైనను, నిజమైనయెడల, ప్రపంచములో నిన్నిమతములే యుండజాలవు.

మఱియు నట్లువాస్తవమును దెలిసికొన్న యెడల, నాప్రకారము గనందఱును భయపడినడతురు- అప్పటికి జెడ్డ యనునదియే, లోకములో లేకపోవును- అప్పుడు దేవునియొక్క లీలాప్రపంచమునకు, బ్రవృత్తియే లేకపోవును - ఈ హేతువుచేతనే, తనమర్మమును దేవుడెవ్వరికినిబట్టియివ్వడు.

వారివారికి దోచినట్టు మతశాస్త్రముల, నేర్పఱచుకొన్నారు.

ఆస్తికనాస్తికమతముల రెంటికింగల
గుణతారతమ్యము- మనస్వాత్మ్యము
చేతనిట్టిదనిసిద్ధాంతీకరించుట.

ఈమతములలో ముఖ్యములైనవి రెండు- ఏవియనిన - మొదటిదియాస్తికమతము- రెండవది నాస్తికమతము- ఆస్తికుడీచిత్ర విచిత్ర ప్రపంచము నానాపదార్థోప యోగములను, రూపవర్ణవిచిత్రములను, నానాదేశములలో, నానాప్రాణులు, భుజించు పదార్థములను, సృజించుటయు, వాట్లకు ననుగుణములైన, కాలవర్షాదులను, గలుగజేసి మనుష్యాదిజీవజంతువులకు భిన్నములైన రూపములను గంతనాదములను వాట్లవాట్ల యాహారములనుగల్గించి, వాట్లకుంచిన యాహారములగొన్నింటికి మాంసముగానున్నవి.

ఆలాటి మృగములకు, బక్షులకు, వాటి పండ్లయందును, గోళ్లయందును, విశేషశక్తిని గలుగజేసియున్నాడు - కీటకాదులు మనుష్యులకు సాధ్యములుగాని కార్యములు చేయుచున్నవి - అవియేవంటే, భ్రమరము కీటకమును, దనవలెనే చేయుట యిత్యాదులు వాట్ల వాట్లవృత్తులకనుగుణమైన జ్ఞానములను శక్తులను ఇచ్చియున్నాడు.

మనుష్యాదులకు విశేషజ్ఞానమునిచ్చి తనవలెనే యనేక పనులు చేయుటకు, శక్తియిచ్చియున్నాడు - అయితే అచేతనమిశ్రితమైన శిల్పములకే కాని, చేతనాచేతన మిశ్రితములు చేసి, శిల్పము చేయుటకు సామర్థ్యమివ్వలేదు - ఆసామర్థ్యము తనయందే యుంచుకొన్నాడు.

మరియు నెంత బుద్ధిమంతునికి, నెంతశక్తిమంతునికి, నెంత సహాయవంతునికి, దనయత్న ప్రకారముగ, నెంతకృషి చేసినను, గార్యములు సిద్ధింపక పోవుటయు, నట్టిశక్తులు లేనివానికి నొక సమయములలో, నయత్నముగా వాడుకోరదగనివియు, సాధ్యములు కానివియు నగు కార్యములు లభించుటయు, నివిమొదలయినవిచూచి, వానియదృష్టప్రకారముగ, ఫలమిచ్చువాడొకడున్నాడని, యిదిమొదలైనమనస్సాక్ష్యములచేత, సర్వకారణకారణస్వరూపుడైన దేవుడున్నాడని, యాస్తికులు నమ్మియున్నారు.

నాస్తికు లివి యంతయు స్వభావమేయని, యొకమూఢబుద్ధితోను ఆస్తికులమీద విరోధముతోను జెప్పుచున్నారు - అట్టినాస్తికులుచెప్పు యుక్తులమీద సమర్పకములు వ్రాసినాను - అయితేవారికి నుండు దురభిమానమువల్లను - ఆలాగు మనస్సుమరగినయభ్యాసముల వల్లను - మేము చెప్పినసమాధానములు తృప్తిగా దోచవు - అయినప్పటికి, నుభయులము - చెప్పుయుక్తులనుబట్టి, సమష్టికి బలాబల

విచారముచేయుద్ధము - ఎట్లనగా, నెట్లుచెప్పువారును గార్యసిద్ధుల విషయములలో, నేకరీతిగానే యున్నారు గాని, యధిక నిదర్శనము నుబొందలేదు - ఈవిషయమై యెగువ వ్రాసియున్నాము.

ఇందువలన దేవుడున్నాడని భయపడి, నడుచుకొనువాడు ఇహములోదనకును నెదటివానికిని, దుఃఖములు కష్టములు, గలుగకుండనున్ను, పరమున్నయెడల, నక్కడదనకు మంచిసంపాదించికొనుటకును, మంచిమార్గముగానున్నది - నాస్తికుడు దేవుడు శిక్షించువాడు లేడని, యెంచుటవలన, నిహములోరాజదండనకు, భయపడవసినదేగాని, రహస్యముగా జెడుపు చేయుటకు వానికి భయములేదు-గనుక నితరులకు దుఃఖమును జేయుచునుండును.

మఱియు బరమున్నయెడల, దేవునియందు నాస్తికతబుద్ధి గల్గినందున, దేవునికోపమునకుబాత్రుడై చెడిపోవుచున్నాడు.

కాగా బలాబలవిచారముచేయుటవలన, దేవుడు న్నాడనిచెప్పుటయేమేలు - ఇందువలననే, ప్రపంచములో దేవుడున్నాడనే యాస్తికమతములే, మెండుగానున్నవి.

నాస్తికుడు మేమిన్నిదృష్టాంతములు చూపినను, వానిదౌర్భాగ్యమువలననో, మాయందలిద్వేషమువలననో, దేవుడేలేడనిచెప్పెడు, వానిమూర్ఖతకు, మేమేమిచేయగలము - పరమందుదేవుడే శిక్షించుచున్నాడు.

నాస్తికధ్వాంత భాస్కరము,

సంపూర్ణము.



